





# కథలు

## నీతి, పురాణ, పొడుపు

# పరమానంద గురువు కథలు





## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

**http://www.new.dli.ernet.in**

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| • Rashtrapati Bhavan<br>• CMU-Books<br>• Sanskrit<br>• TTD,Tirupathi<br>• Kerala Sahitya Akademi | • INSA | • Times of India<br>• Indian Express<br>• The Hindu<br>• Deccan Herald<br>• Eenadu<br>• Vaartha | • Tamil Heritage Foundation<br>• AnnaUniversity NEW! |

**Title Beginning with.**

| A | B | C | D | E | F | G | H | I | J | K | L | M | N | O | P | Q | R | S | T | U | V | W | X | Y | Z |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|

**Author's Last Name**

| A | B | C | D | E | F | G | H | I | J | K | L | M | N | O | P | Q | R | S | T | U | V | W | X | Y | Z |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|

**Year**

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
|---|---|---|---|---|---|---|

**Subject**

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
|---|---|---|---|---|---|---|---|---|

**Language**

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
|---|---|---|---|---|---|---|---|---|

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

బాలవిజ్ఞాన గ్రంథమండలి-1 సంపుటము

ఓం శ్రీర్విజయతే

# పరమానంద గురువు కథలు

శ్రీ తెన్మరం వెంకటనరసింహాచార్యులుగారిచే
పరిష్కరింపబడినది

పబ్లిషర్సు:

ఆంధ్ర పబ్లిషింగ్ హౌస్

వేపేరి, మద్రాసు–7

దీనిని దాఁటరాదు. మీలో ఒకరు పోయి యిది నిద్రపోవుచున్నదో మేలుకొని యున్నదో చూచిరండి, అని చెప్పెను. అదివిని విపరీతనిపుణుఁడు మెల్లమెల్లగా అడుగులెత్తి పెట్టుచు చప్పుడు చేయక సన్నగా పాఱుచున్న నీళ్ళ వెంబడికిఁబోయి, రెండడుగులు ఎడఁగలుగ నిలిచి, తాను చుట్ట కాల్చుకొనుటకై తెచ్చికొన్న కొఱవికట్టెను నీళ్ళలో ముంచెను. అంతట చుంయిమనుశబ్దముతో నీళ్లలోనుండి పొగ మొగసెను. అదిగని వాఁడు అమ్మమ్మా! చచ్చితిఁజచ్చితి. అని కేకలు వేయుచుఁ జేతనున్న కొఱవికట్టెను సయితము ఒకతట్టు పాఱవేసి ఎగిరిపడి గడగడ వడఁకుచు మాటిమాటికి పడుచు లేచుచు చాట చొంగఁగార్చుచు వచ్చి గురువు పాదములమీఁద సాగిలఁబడి, స్వామీ! మాతల్లి కడుపున మరలఁబుట్టితి, మీపాద సేవాఫలమో నన్ను కడతేర్చినది. లేనిపక్షమున నింతమట్టుకు పరలోకమున పాఁతకాఁపునైయుందును. ఔరా పాపజా! ఎంతక్రూరజంతువే నీవు అని చెప్పుచు మూర్ఛపోయి యిప్పటికి అరతలో కళ తెలుసికొని, స్వామీ! గురుపరానేను ఘుందే యీ యేటిచర్యలు కొన్ని కొన్ని వినియుండియు మీయాజ్ఞ మీఱలేక పోతిని, పోయినందుకు తగిన ఫలమును వెంటనే అనుభవించితిని. దీనిక్రౌర్యమేమని చెప్పుదును. నేను ఎడముగా నే నిలుచుండి చేతి గట్టిపుల్లతో మెల్లగా తాఁకితిని. తాఁకగానే క్రోధముపామువలె బుస్సని బుసకొట్టుచు నన్ను కఱవవచ్చెను. అంతట నేను కడగండ్ల మారికట్టెను కనుక ఒక్కదెబ్బగు రెగిరి నాలుగుబారల దూరము ఇవతలపడి లేచి

వచ్చితిని. అట్లుచేయక కొంచెము నిదానించియున్న పక్షమున నన్ను అది అప్పుడే నోటవేసికొని యుండును. "మీపాదాల చలువచేత నాకు మంచిబుద్ధిపుట్టి తప్పించుకొని మీసన్నిధాన మునకు వచ్చి చేరినాను." అని చెప్పఁగా, గురువువిని నాయనా! దిగులుపడఁబోకు, నిన్ను గాలి భూతము సోఁకకుండ నేను విబూది పెట్టెదను కాని కొంచెముధైర్యము తెచ్చికొని కూర్చుండుము. ఇది యేఱుదాఁటుటకు తగిన సమయముకాదు. ఇప్పుడు మేలుకొనియున్నది కనుక కొంచెము ఆయాసము తీర్చుకో! అంతలో ఏఱును నిద్రపోవును. పిమ్మట మనము మెల్లగా దాఁటి అవతలిగట్టునెక్కుదము. మనచేత నైనంతలో జాగ్రత్తతో ప్రవర్తింపఁగా మీఁద దైవగతిచొప్పున జరగునది జరగును, అందుకుమనమేమిచేయఁగలము, అని వాని తనదగ్గఱకుచేరఁదీసియోదార్చుచుండెను. అప్పుడుఅజ్ఞానశిరోమణి గురువుతో నిట్లనియె.

అయ్యగారూ! ఈయేటియొక్క వంచకత్వమును క్రూరత్వమునుమా తాతగారు పలుమారుచెప్పఁగావినియున్నాను. ఒకానొకప్పుడు మా మాతాత ఉప్పుబేరము చేయుచుండి తన పొత్తుబేరగానితోఁగూడ కొటూరునకుఁబోయి రెండు గోనెల ఉప్పుపట్టించి రెండు ఎనుబోతులమీఁద వేసికొని వచ్చుచుండఁగా, ఈయేఱుఱొమ్ములలోఁతునఁబాఱుచుండెను. అది యెండకాలమయినందునను, యిక్కడికి వచ్చునంతలోమిక్కిలి యెండ యెక్కినందునను గోనెలు మోసికొని వచ్చిన పోతులు ఎండబెట్టకు సహింపక ఉప్పుగోనెలతోఁగూడ ఏటిలోదిగినవి.

వానివెంటనే మా తాతయు ఆయన పొత్తుజేరగాడును ఏటి లోదిగి ఎండవడఁదీఱఁ గొంతసేపు ఈఁదులాడి దున్నపోతుల ఒళ్లును గడిగి వానిని వెడలఁ దోలుకొని యీవలిదరికి వచ్చి చూతురుగదా! కట్టినగోనెలు కట్టినట్లేయుండ, వానిలోపలి యుప్పు ఒక కల్లయిన లేకుండ యేఱు మ్రింగివేసిన సంగతి తెలియవచ్చెను, అప్పుడు వారు, మనము గొప్ప అపదను తప్పించుకొంటిమి. ఈయుప్పుమనప్రాణములను కాపాడెను, ఉప్పుమాత్రము లేనిపక్షమున ఈయేఱు మనలను అప్పుడే మ్రింగివేసి యుండును. ఔరా యేఱా! అని ముక్కుమీఁద [illegible] కొని తిన్నగా [illegible] ఈవృత్తాంతము విని "ఉసురుఉన్న ఉప్పమ్ముకొని బ్రదుకవచ్చును" అను సామెత యిందువల్లనే పుట్టెనని నిశ్చయించి, ఉప్పుపోయినను పోనీ ప్రాణములు తప్పించుకొని వచ్చినారు గదా! యని సంతోషించిరి.

అని అజ్ఞానశిరోమణి చెప్పగానే అచేతనతిలకుఁడు శిరఃకంపము చేయుచు లేచినిలువఁబడి, స్వామీ! నామనవిగొంచెము వినుఁడు' అని యిట్లనియె.

ఈ యేఱు అతి కపటస్వభావము గలది. ప్రత్యక్షమందే వస్తువులు కప్పి దొంగిలించుటయందు దీనికంటె నేర్పుగలది మఱియొకటి లేదు. ఈ విషయము నాకును అనుభవ సిద్ధము నేను చిన్నవాఁడనుగా నున్నప్పుడు మాతండ్రి చక్కెర బేరమాడుచుండి, ఒకనాడు నాలుగుదున్నపోతులమీఁద నాలుగు మూటలచక్కెర వేసికొని నన్ను వెంటఁబెట్టుకొని యీదారిని

వచ్చెను. అప్పుడు ఈ యేటిలో మొలబంటినీళ్ళు పాఱుచుండెను. ఆనీళ్ళకు వెఱవక పోతులతోఁగూడ నీళ్ళలో దిగితిమి. అంతట పసివాఁడుగదా అని నన్ను ఈ యేఱు కడకాళ్లుపట్టి లాఁగసాగెను. అది తెలిసి మానాయన నన్నుఎత్తి భుజముల మీఁద కూర్చుండఁ బెట్టుకొని మెల్లగా ఏఱుదాఁటెను. దున్నపోతులుమాత్రము వానిస్వభావముచొప్పున మూఁపులమీఁది గోనెలతోనే నీళ్ళలో పండుకొనిపొరలి పొరలి యీఁదులాడసాగెను. అయినను మానాయన వానిని స్వేచ్ఛగా నీదులాడనియ్యక నిమిషకాలములోనే నీళ్లుదాఁటఁ దోలుకొనివచ్చెను. అంతజాగ్రత్తతో దాఁటివచ్చియు దరిచేరిచూడఁగా, గోనెల మూఁతులు కుట్టినవి కుట్టినట్టేయున్నవి. ఒక గోనెలోనైన పట్టెఁడు చక్కెర కానము అదిచూచి మానాయనయీచక్కెరయుండఁగా మనముమిఁగిలినాము, లేనియెడల అప్పుడే దీని వాతఁబడిపోదుము. అని చక్కెరపోవుటవల్ల వచ్చిన నష్టమునుగూడ తలఁపక నన్నుఁ బిలిచికొని సంతోషముతో యిల్లు వచ్చిచేరెను.

అని అచేతనతిలకుఁడు చెప్పినిలుపఁగానే మూఢజనేంద్రుఁడు గురువుతో నిట్లనియె.

ఓగురురాయా! నా విజ్ఞాపనమును కొంచెము వినుఁడు. ఈయేటివంచకత్వమును నేను ప్రత్యక్షముగాచూచియున్నాను అయిదాఱునెలల క్రిందట నొకనాడు వంటచెఱకులకయి నీ యేటి వెంబడి యడవికివచ్చియుంటిని. అప్పుడువంటచెఱకులు ఏఱిప్రోగువేసి, దప్పిఁగొని, ఈయేటికివచ్చి దప్పిదీఱ నీరుత్రాగి

గట్టున చెట్టునీడను గూర్చుంటివి. ఆ సమయమునందు ఒక కుక్క ఒకమాంసఖండమును నోటఁబట్టుకొని నీ యేటిలో దిగెను, ఇది ఆకండను నాఁచుకోఁదలచి తననీళ్ళలో, అంత కంటె గొప్పకండను కనఁబఱచెను. కుక్కయీమోసము తెలిసికోలేక నీళ్ళలోనికండను కవ్వకొనుటకై నోటనున్నకండను జారవిడిచెను. ఏఱు ఆ రెండుకండలను తనలో నణఁచుకొనెను. అంతట కుక్క మొగము వేలవేసికొని ఊరు చేరఁబోయెను. ఇదంతయు కన్నులారఁజూచి, ఏటియొక్క నేర్పునకు ఆశ్చర్యపడుచు వంటచెఱకులు తీసికొని సాయంకాలమునకు మఠమువచ్చి చేరితిని.

అని మూఢజనేంద్రుఁడు చెప్పి నిలుపఁగానే నిరక్షరకుక్షి తానును తనయనుభవమునుబట్టి యేమో ఒక కథ చేప్పుటకు యత్నించెను, గాని ఇంతలో చిలచిలమని ధ్వనియొకటి వినరాఁగా. వారు అందఱును నిదియేమిచప్పుడని ఏటివంక తిరిగి చూచిరి. అప్పుడు ఏటిగట్టునుండి గుఱ్ఱమునెక్కివచ్చు బాటసారియొకఁడువారికిఁ గనఁబడెను. ఆగుఱ్ఱపురౌతువచ్చునపుడు ఏటిలో గిఱకలబండిసీళ్లే పాఱుచున్నందున గుఱ్ఱము నడచువడికి ఆనీళ్లుచిల్లుమనియెగయుటను వారుచూచిరి. గుఱ్ఱము వచ్చురాకను అది యడుగులు పెట్టునపుడు కలుగుచప్పుడును నీళ్లువెగయుటనుచూచి విపరీతనిపుణుఁడు, ఓ చెడ్డ ఏఱా! నీ గర్వమును అణఁగద్రొక్కుటకు ఈగుఱ్ఱమేసరి, నీపోకలు మాయొడల కొనసాగినట్లు గుఱ్ఱమునెడలకొనసాగునా? అట్లైకావత్తె, అమ్మమ్మ, తక్కినశిష్యులతో ఓియన్నలారా! గుఱ్ఱమువచ్చు

విధముచూచితిరా? దాని సహాయముచేత ఆ తెరువరి యెంత నిర్భయముగ ఏఱుదాఁటెనో చూడుఁడు. అయ్యో! మనగురువులవారికి ఒకగుఱ్ఱమున్నయెడల ఆగుఱ్ఱము నెక్కి వారును వారిని ఆశ్రయించుకొని మనమును అనాయాసముగా నెప్పుడో యేఱుదాఁటిపోయి యుండవచ్చునే! కొంచెమునకు ప్రాణములమాలి వ్యర్థముగా ఈ యేటిగట్టున పడియున్నాముగదా! కానిండు, ఇక ఊరక ఉండరాదు. మనము మఠము చేరఁగానే నెట్లయిన తగుపాటిగుఱ్ఱము నొకదానిని సంపాదింప యత్నింపవలెను అని చెప్పెను. ఆమాటలువిని సరిసరి మంచి ఉపాయమును ఆలోచించితివి, అని వానిని అందఱును శ్లాఘించి, ఒక్కటిగా గురువునుతప్పక గుఱ్ఱమునుదీసికోండి, తీసికోకపోతిరా! మనగతియింతే, అనినిర్బంధింపసాగిరి. అందులకు ఆయనయేమితోఁచక ఏదోఒకవిధముగా ఈయాత్రపూర్తిచేసికొని మఠముచేరినంతట గుఱ్ఱమును తీసికొను విషయమయిఆలోచింతము ప్రస్తుతము ఏఱుదాటుటకుమార్గమేమో విచారింపుఁడు అనిచెప్పెను. అనఁగా నిరక్షరకుక్షి, స్వామీ! అదియుమీభారమే. మీకంటెవిధినిషేధములునిర్ణయింపఁజాలినవారు ఇందులో నెవరుఅనఁగా, గురువు విపరీతనిపుణుని జూచి, నాయనా! మనలో నీకంటె ధీరుఁడొకఁడైనను కానము. మెల్లగాపోయి మునుపటివలెనే ఎఱుమేలుకొనియున్నదో నిద్రపోవుచున్నదో పరీక్షించి తెలిసికొనిరా?అని మంచలించెను. వాఁడు అందుకు నేనేనా పాలుపడ్డవాఁడను, అని నుసులుచు లేచి మెల్లమెల్లగానీళ్లదగ్గఱకుపోయి, ఆ వెంబడిపడియున్న

మునుపటి కొఱవికట్టెతోనే నీళ్ళనుముట్టెను. అప్పుడు అది చల్లారియుండెనుగనుక మునుపటివలెచుంయిమనక నిశ్శబ్దముగా నుండెను. అంత వాఁడుమహాసంతోషముతో గురువువద్దకువచ్చి, "స్వామీ! ఇదిమంచిసమయము. ఏఱు ఒళ్లు తెలియక నిద్రపోవుచున్నది. అదిమేలుకొనకుండ నిశ్శబ్దముగా రండి; కాలుచేయి కదలింపఁబోకుఁడు, నోరెత్తి మాటలాడకుఁడు." అని రహస్యముగా చెప్పెను. గురువు సరే మంచిపనే ఏఱు మేలుకోకముందే దాఁటిపోదము రండి అని ముందుకదలెను వెంటనే శిష్యులును కదలిరి. నీళ్ళచేరువకుపోగానే, గురువు రహస్యముగా 'భద్రము భద్రము' గుక్కుమిక్కు మనఁబోకుడు. కాళ్ళుతాకిన నదిమేలుకొనునేమో అడుగుమెల్లగా పెట్టుఁడు. అదియెచ్చరికపడిమేలుకొనెనా మనప్రాణములుదక్కవు. అని శిష్యులకు హెచ్చరికచేసి చెప్పుచు అడుగెత్తిపెట్టినప్పుడెల్ల నిదానించిపెట్టుచు తిన్నగా ఏఱు దాఁటెను. శిష్యులును ఇట్లే దాఁటిరి. అందరు గట్టెక్కగానే వెనుకవచ్చుచున్న మూఢజనేంద్రుఁడు పెద్దగండముగడచితిమి అనుచుతనకుముందువారిని తన్నుఁగలుపుకొనక యెంచి అయిదుగురే లెక్కకు వచ్చినందున, అయ్యో! చెడితిమిచెడితిమి. మనలో ఒకనిని ఈయేఱుకబళించెను, ఇంకయేమిగతి. అని బొమ్మమోఁదుకొనుచు పెద్దపెట్టున నేడువసాగెను. అంతట ముందుపోవుచున్నవారు వెనుకకుమరలి వానినికట్టుకొని యేడువసాగిరి. ఇట్లు కొంతసేపుఏడ్చి, పిమ్మట ఒకరినొకరు నూఱడించుకొనుచు, ఏడ్పులుచాలించిరి. అప్పుడు గురువుయింకొకతూరి యెంచి

మాత్రము, అని శిష్యులను అయిదుగురిని వరుసగా నిలువఁ బెట్టి తన్నుఁ జేర్చుకొనకయే యెంచి, మూఢజనేంద్రుఁడు చెప్పినదే సరియనెను. అంతటితో సరిపెట్టుకొనక ప్రతిశిష్యుఁడును ఆచొప్పుననే యెంచి యెంచి, ఆలవవాఁడు పలానివాఁడని తెలిసికోలేక, తమలో నొకనిని ఆయేఱు మ్రింగినదే వాస్తవమని నిశ్చయించుకొని, కుయ్యో మొఱ్ఱో యని యంగలార్చుచు, 'ఓపాడు ఏఱా! నీ వంటిక్రూరులెవరు? నిన్ను చల్లనిదానివని నమ్మి మావలెయెందరు చెడిరో కదా! యెంత పాపభీతి లేనిదానివే? లోకములోని సజ్జనులందఱు భక్తియుక్తులై సేవింపఁగా వర్తించునట్టి పరమానంద గురువులలో నొకనిని వాతవేసికొంటివిగదే! నిన్నేమనవచ్చు, ఓ గోముఖవ్యాఘ్రమా! నీపాడవుపాడై నేలఁగలయదా, నీ యాట యడుగంటదా, నీపొంగు క్రుంగదా, నీపేరు పెన్నలోఁ గలయ, నీకడుపు డుక, నీనీళ్ళు నిర్మూలముగాను, ఇంత పనికి పాలుపడినదానవిఁక నెంతపనికైన వెనుదీయుదువటే, పాపజాతీ!' అని పిట్టశాపములు పెట్టుచు, మెటికలు విఱుచుచు, గ్రుడ్లు ఉముచు ఏటిని తిట్టితిట్టి యలసి, తలలు వ్రేలవేసికొని దారిలోఁ గూర్చుండి చింతించుచుండిరి కాని, ఒకరైనను తమ తెలివిలేమిని తెలిసికొని తమలో నొకఁడు లెక్కకురామికి కారణము నూహించినవారు కారైరి.

ఆ సమయమునందు బుద్ధిమంతుఁడయిన ఒక బాటసారి, దారినిబోవుచు వీరినిజూచి, వీరి విచారమునకు కారణమును అడిగి తెలిసికొని, యీ మూఢులను తిక్కఁదెలియ

మోఁదిపంపుట మంచిదని నిశ్చయించి, 'అయ్యో! పాపము పాపిష్ఠియేఱు మీకు రారాని యిక్కట్టువచ్చుటకు హేతుభూత మయ్యెనా? అయిన నేమాయెను విచారపడకుఁడు. మీచింత దీర్చుటకు నాకు శక్తిగలదు. నేను సకల మంత్రవేత్తయైన యొక బైరాగి నాశ్రయించి, ఆయన యనుగ్రహమువల్ల ఒకమహామంత్రమును నేర్చికొంటిని, అది యమలోకమునకుఁబోయిన ప్రాణులనైన తెచ్చి యెదుట నిలుపఁగలదు. అందులకుఁ దగిన బహుమతి మాత్రము మీ రియ్యవలెను. అనఁగానే పరమానంధగురువు పరమానంద భరితుఁడై, ఓ మహానుభావా! నీవే మాపాలిటి భాగ్యదేవతవు. కొండంత దేవరకు కొండంతపత్రిఁ బెట్టువారెవరు? "చంద్రునకునూలిపోగు" అన్నట్టు మాశక్తికొలఁదిని నిన్నుఁ బూజింపఁగలము. సముఖమున రాయభారమేమి మేము ఇంటినుండి వచ్చునపుడు దారిబత్తెమునకై చెరియొక మాడ తెచ్చుకొనియున్నాము. అది యల్లై నీచేత పెట్టుమన్న పెట్టెదము. మమ్ము అనుగ్రహించి ఏటిపాలయిన నాశిష్యుని రప్పించి మాలోగలిపి పుణ్యము గట్టుకొనుము, అని వేఁడుకొనెను. ఆమాటలు బాటసారివిని, "నడిమితేరగాఁడు చినపాపి మగఁడు" అన్నట్టు నేను వీరికి మహామాంత్రికుఁడనైతినని తనలోఁ దాననుకొనుచు చేతఁబట్టుకొనియున్న బెత్తమును ఆ గురుశిష్యులకుఁజూపి, ఆమంత్రము దీనిలోఆవాహన చేయఁబడియున్నది. మీరందఱు వరుసగా నిలువఁబడి యిందులో నొక్కొక్కదెబ్బఁ దీసికొని నేను పలానివాఁడను అని

చెప్పుచు క్రమముగా లెక్కపెట్టుకొనుఁడు. కడపట ఏటి పాలయినవాఁడు తనంతటవచ్చి చేరుకొనును'' అని చెప్పి, అందుకు వారు సమ్మతింపఁగా, మొట్టమొదట గురువుపీఁపున బెత్తముతో ఒకపెట్టు పెట్టెను. ఆపెట్టు దీసికొని, అబ్బబ్బా! నేను పరమానందగురువును అనిచెప్పుచు ఒకఁడు అనిలెక్క పెట్టుకొని కొంచెమీఁవలికివచ్చెను. అటుపిమ్మట క్రమముగా శిష్యులయిదుగురును ఒక్కొక్క దెబ్బదీసికొని, నేను అజ్ఞానశిరోమణిని. నేను అచేతనతిలకుఁడను, నేను నిరక్షరకుక్షిని, నేను విపరీతనిపుణుఁడను, నేనుమూఢజనేంద్రుఁడను అని చెప్పుచు యివతలికివచ్చుచుండఁగా గురువు యిద్దరు ముగ్గురు నలుగురు అయిదుగురు ఆర్గురు అని లెక్కపెట్టుకొనుచు వచ్చి ఆర్గురును సరిపోఁగా, బాటసారిని మిక్కిలి శ్లాఘించి వానికి ఒప్పుకొన్న చొప్పున ఆరు మాడలును సమర్పించి పంపించెను. వాఁడు ఈ మహామూఢులు నాచేత దెబ్బలుతిని మీఁది మిక్కిలి నాకు తేఱకు ఆరుమాడలు రొక్కముగూడ దారవోసిరి. అనితన్నలో నవ్వుకొనుచు తనదారి పట్టుకొని పోయెను.

పరమానందగురువు శిష్యులతోఁగూడ దేశయాత్ర చేసి కొన్నాళ్ళకు మఠమునకుఁబోయి చేరెను.

## రెండవది

### గుఱ్ఱపు గ్రుడ్డును తెచ్చినకథ.

మఠముచేరిన పిమ్మట పరమానందగురువు తన్ను చూడవచ్చిన వారితోనెల్ల తన తో వృత్తాంతమును చెప్పుచు

తాము ఏఱుదాఁటినపుడు సంభవించిన ఆపదనుగూర్చి విచారించుచునుండెను. అప్పుడు ఆ మఠములో ప్రాచిపనిఁ జేయుచున్న ముసలిది గురువునుజూచి అయ్యా మీరు మోసపోతిరి. ఆ తేరగాఁడు మిమ్ము మోసపుచ్చి మీచేత రూకనాచుకొనిపోయెను. లెక్కపెట్టుకొనునపుడు తన్నుఁగాని, తనయెదుటి వానినిగాని విడిచి లెక్కపెట్టుకొన్నయెడల ఒకడు తగ్గిపోవును. మీరు అట్లుచేయుటచేతనే మోసము వచ్చినది. ఇఁక నిటువంటి మోసమురాకుండ నొక ఉపాయము చెప్పెదను వినుఁడు. నేను చిన్నదాననుగా నున్నప్పుడు నా యీడు పడుచులతోఁగూడ ఒక అడవిలో వంటచెఱకు తేరుకొని రాఁబోతిమి. అప్పుడు తలా ఒకతట్టు చీలిపోయి మరలకలిసికొనునప్పుడు అందఱువచ్చిరా లేదా? అని తెలిసికొనుటకై, అక్కడక్కడ పడియున్న పేడకళ్లు కొన్ని తెచ్చి వరుసగా ముద్దలుచేసిపెట్టి, అందరు బోరగిలఁబండుకొని ఆ పేఁడ ముద్దలలో ముక్కులుఅద్ది, ముక్కు గురుతులు గల పేఁడముద్దలన్ని యెంచుకొని అందఱువచ్చి చేరినసంగతి తెలిసికొని నిర్విచారముగా ఇండ్లువచ్చి చేరితిమి. ఇకమీఁద మీరును అట్లుచేసి లెక్కతప్పక యెంచుకొని నెమ్మదిగా రండు, అని చెప్పెను.

అదివిని పరమానందగురువు ముసలిదాని బుద్ధికుశలతకు మెచ్చికొని, ఈ యవ్వ చెప్పినది మంచి యుపాయము. ఇంతమాత్రపు డబ్బుపోకడలేనియుక్తి మనకుఁదోఁచకపోయెను. అందుకు అప్పుడు ఏమిచేయవచ్చును? వెనుకఁ

జింతించుట వెఱ్ఱితనము. అని గురువు చెప్పగానే శిష్యులు మీరు సెలవిచ్చినది సరే, ఏది యెట్లున్నను మనకు ఒక గుఱ్ఱము ఉండుట మంచిది, అది ఉన్న పక్షమువ ఏ తొందరలును గలుగవు, కనుక ఏవిధమునన్నైన గుఱ్ఱమును సంపాదింపయత్నింపుఁడు, అని యేకవాక్యముగా చెప్పిరి, అందుకు గురువు గుఱ్ఱపువెల యెంతయుండును, అదివిచారించి చెప్పుఁడు, పిమ్మట దానినిగుఱించి యోచించెదను, అని చెప్పి, వారు నూఱునూటయేఁబది వరహాలు పట్టును అనఁగా అంత మొత్తము మనవద్దలేదు, గుఱ్ఱము మనకు లభింపనుజాలదు, మీరుఇఁక ఆయాలోచనమానుకొనుడని చెప్పియూరకుండెను.

అటుపిమ్మట నొకనాడు మఠములోనున్న పాఁడియావు మేయఁబోయి వాడుకచొప్పున మాపటివేళకు ఇంటికిరాకపోఁగా, గురువు శిష్యులను దానిని వెదకఁబంపెను. వారు చుట్టుపట్టు తోఁటలలోను, దొడ్లలోను వెదకి ఎక్కడను గానక అర్ధరాత్రమునకు వచ్చి మఠముఁజేరిరి. మరునాఁడు ఇరుగుపొరుగు గ్రామములలో వెదకిరమ్మని అజ్ఞానశిరోమణిని గురువుపంపెను. వాఁడు మఠమునుండి బయలుదేఱి రెండు మూడు దినములదాఁక చుట్టుపట్ల ఊళ్లన్నియుఁ దిరిగి వెదకి ఆవుపోబడి తెలిసికోలేక వెదకినమట్టుకు చాలును. 'ఇప్పటికి దొరకనిది ఇఁకనా దొరకపోవుచున్నది' – అని యెంచుకొని మూఁడవనాటి సాయంకాలమునకు మఠమువచ్చిచేరి, గురువు పాదములు తలసోఁక సాగిలఁబడి, స్వామీ! నేను ఎంతో దూరము వెదకినాను ఆవుపోబడే తెలియలేదు. అయినను

ప్రయాసమునకుఁ దగిన ఫల మేమో లేకపోలేదు. కొంచెపు వెలకే గుఱ్ఱము దొఱకు మార్గ మొకటి కలిగెను. అని చెప్పఁగా, గురువు ఎట్లెట్లు గుఱ్ఱమా, కొంచెపు వెలకు దొరకునా? ఏదీ ఆ వృత్తాంతము కొంచెముగఁ జెప్పుము. తని తమకముతో అడిగెను. అంతట అజ్ఞానశిరోమణి తాను ఒకానొకయూరి చెరువుకట్టమీఁద మెండుగాఁగా ఁచియుండిన బూడిదగుమ్మడికాయలను జూచి గుఱ్ఱపుగ్రుడ్లు అనుకొన్న వృత్తాంతము నిట్లుఁ జెప్పనారంభించెను, అయ్యగారూ! నేను మన ఆవును వెదక, నూరూరు పల్లెపల్లె యు[illegible]వి తిరుగువాఁడను ఒక యూరివెంబడి పెద్దచెఱువునుజూచితిని. ఆచెఱువుకట్టమీఁద నాలుగైదు ఆఁడుగుఱ్ఱములు మేయుచుండెను. వానిని జూచుచు చెఱువుకట్టమీఁదనే మఱికొంత దూరముపోఁగా, ఆకట్టమీఁద నొకచోట సున్నముఁబూసిన గుండుఱాళ్లు తెచ్చి అంతటపఱిపినట్లు కనఁబడెను. ఈయిసుక భూమిలో ఇన్ని ఱాళ్లు నివరు తెచ్చి వేసిరో, ఇవియు చిన్నవి గాక పెద్దపెద్దవిగా నున్న వేయని ఆలోచించుచు వానిదగ్గఱకు పోయి చూచునపుడు అవి గ్రుడ్లనితోచినది,. వానికి కావలియున్న సంసారినొకనినిజూచి, ఓ పుణ్యవంతుఁడా! ఇవియేమిటివి గుఱ్ఱపుగ్రుడ్లా? అనియడిగితిని. వాఁడు అవును–ఇవి గుఱ్ఱపుగ్రుడ్లే అని చెప్పెను. అంతట నేను మన మనోభీష్టము నెఱవేరునట్టికాలము వచ్చెనని ఇవి ఒక్కొకటి ఎంతకిత్తురుఅని అడిగితిని. వాఁడు ఇవి ఒక్కొక్కటి నాలుగువరహాలు ఐదు [illegible]హాలు వెలగలవిగా నుండును. చక్కఁగా తేటిన గ్రుడ్లు

అయినపక్షమున పదివరహాలకు తగ్గదు అని చెప్పెను. కనుక నిది మంచిసమయము. అప్పుడే మనము జాగ్రత్తపడి ఒక గ్రుడ్డును తెచ్చుకొంటిమా? అది మనచేత నేపొదిగి పెద్దఁ జేయఁబడి మనకు అణఁగియుండును. అని అజ్ఞానశిరోమణి చెప్పగా వినిహర్షించి గురువును అచేతనతిలకుఁడు, మొదలైన తక్కినశిష్యులును సరియని యొప్పుకొనిరి. మఱునాడు గురువు తాను బహుదినములుగాఁ గూడఁబెట్టిన అయిదువరహాలు అజ్ఞానశిరోమణిచేతికిచ్చి వానికి తోడుగా నిరక్షరకుక్షిని పొమ్మని ప్రయాణముఁజేసెను. ఆయిద్దఱును ప్రయాణమై బయలుదేఱఁబోవునప్పుడు మూఢజనేంద్రుఁడు తనకుఁ గలిగినశంకను నివర్తిచేసికోఁదలఁచి, గురువుతో స్వామీ! మీరుచేయుయత్నము మనకు సుఖకరముగా నుండునని నాకుతోఁచలేదు. ఇప్పుడు మనవారుపోయి మంచి ఉత్తమ జాతిగుఱ్ఱపుగ్రుడ్డు తేనేనిండ్లుఅదిమిక్కిలి ప్రయాసపడి పొదుఁగక పిల్లకానేర్చునా మనలో దానిని పొదిఁగిపిల్లచేయువారెవరు, పదికోళ్ళనైన తెచ్చి పొదుఁగవిడువవచ్చునన్న అవి పక్షిజాతిలోఁ జేరినవి, గుఱ్ఱము మృగజాతి ఇందుకు ఏమిచేయవచ్చును? నిశ్చయింపుఁడు అని మందలింపఁగా తక్కినవారికిని అదేశంక పుట్టి యేమియుఁదోచక కొంతసేపుచిత్రపుప్రతిమలవలె కదలక మెదలకకూర్చుండి మిణకరించుచుండిరి. పిమ్మట గురువు ఒకవిధముగా తనలో నిర్ధారణఁజేసికొని తనయెదుట బ్రహ్మలోకపర్యంతము విచారించుచుఁ గూర్చున్న శిష్యులు ముగ్గురిని బిలిచి నాకొకయుక్తితోఁచినది. ఏమనగా, మనతో

నెవరైన నౌకరు అదిపనిగాఁగూర్చుండి ఆగ్రుడ్డుకు పొదుఁగ వలసినది. అంతకంటె ఉపాయమేమియుఁ గానముఅనఁగానే వారుముగ్గురును అది యెట్లు సరిపడును ఒక్కొక్కరుగాఁ దమకుఁగల నిర్బంధపుపనులను వివరింపసాగిరి. అందుమూఢజ నేంద్రుడు ప్రతిదినము తెల్లవారి లేచి ఏటికిపోయి బహిశ్శంకఁ దీర్చికొని పండ్లుతోముకొని మొగముకడుగుకొని ధోవతులు ఉదుకుకొని స్నానముచేసి అప్పటికి ఉచితములైన అనుష్ఠాన ములన్ని యథావిధిగాఁ జేసికొని వంటకు స్నానపానములకు కావలసిన జలము తెచ్చియిచ్చుటకును అడవికిబోయివంటచెఱ కులు తెచ్చియిచ్చుటకును నాకు ప్రొద్దుచాలకయున్నదే నేను గ్రుడ్డుపొదుగుటకు యెప్పుడు, అనెను. అంతట నిరక్షరకుక్షి స్వామీ! నాకుగలపని అందఱకు స్పష్టముగా తెలియుచునే యున్నది. ప్రొద్దున స్నానముచేసి వంటశాలఁ బ్రవేశించితినా ప్రొద్దుగ్రుంకిన రెండుజాములవఱకు ప్రొయివిడిచి యీవల రాను తీఱదు. బహువిధముల కూరలు కలవంటకములువండను వింతవింత పిండివంటలుచేయను వచ్చెడివారినిపోవువారిని విచా రించి ఆకులువేసి అన్నములువడ్డింపను చన్నీళ్ళలోస్నానము చేయలేనివారికి వేన్నీళ్లు కాచియియ్యను సహాయపడువారు లేక నేను పడునట్టివిసుగు చెప్పినఁదీఱదు. ఇట్లుండగా నేనె ప్పుడు గ్రుడ్డుపొదుఁగుదును అనఁగా విపరీతనిపుణుఁడులేచి చేతులు జోడించుకొని గురువునకు ఎదురుగా నిలువబడి స్వామీ! తెల్లవాఱకమునుపే నిద్రలేచి ఏటికిఁబోయి శంక పూర్తిఁ జేసికొని తుమ్మచెట్టువెదకి పుల్ల విఱుచుకొనివచ్చి

దంతధావనము చేసికొని పుక్కిలించియుమిసి మొగముకడుగు కొని పిమ్మట క్రమముగానన్ని యనుష్ఠానములుతీర్చికొని అందుండి పూఁదోటలకుఁబోయి అన్ని తోఁటలును క్రమముగా తిరిగి మంచి మొగ్గలుగా ఏఱికోసికొని పరిశుద్ధముగా తీసికొని మఠమునకువచ్చి నరాలుగ్రుచ్చి గంధముతీసియుంచి అనేక విగ్రహములకును సాలగ్రామములకును క్రమముగా అభిషేకములు చేసి గంధపుష్పధూపదీపాదులతోఁడ దేవతార్చనముఁ జేయ మీకుఁదోడుపడుటకు నాకు నిత్యకృత్యముగానున్న దే నేను గ్రుడ్డునుపొదుఁగుట యెట్లు అని చెప్పి, ఇందుమీఁద మీ యోచనయేమి అనియడిగెను. గురువు ఏమియోచనయున్నది మీవలెనే గ్రుడ్డు తేఁబోయినవారికిని తీరని పనులు ఉన్నట్టులున్నవి. ఒకడు వచ్చుచుఁబోవుచుండు పెద్దమనుష్యులను విచారింపను, వారు అడిగిన విషయములకు ప్రత్యుత్తరములు చెప్పను, నడుమనడుమ పొసఁగిన వివాదములు తీర్పను ప్రొద్దుచాలక తడఁబడుచుండును. మఱియొకఁడు సంతకు చావడికి పోయిరాను, నాకు దేనికైన పిలిచినపనికి పలుకను నుండవలసినయున్నది. ఉన్న తావునుండి కదలక వచ్చినవారితో మాటలాడుచుండుటతప్ప మఱియేమి పనిలేనివాఁడను నేనుగా నేర్పడుచున్నాను, కనుకఁ తెల్లవాఱిలేచి అనుష్ఠానముఁదీర్చికొనికాఁగానే ఆ గ్రుడ్డును ఒడిలోనుంచుకొని దుప్పటితో కప్పియు, వెచ్చలుగ రొమ్మునననఁచిపెట్టుకొనియు జాగ్రత్తతోనే ఆగ్రుడ్డునుపొదిఁగి పిల్లనుజేసెదను, ప్రయాసపడక పోయిన మంచిగుఱ్ఱము ఎట్లుకలుగును. ఎట్లయిన పడవలసిన

పాటు పడక తీరదుగదా! అనఁగా, శిష్యులు సరి సరి యనిరి.

ఇట్లు మఠములోనే గుఱ్ఱపుగ్రుడ్డును పొదుగుటకుఁగల సాధక బాధకముల విచారించి నిర్ధారణచేసికొని రాత్రి చంద్రోదయము కాఁగానే మఠమునుండిబయలుదేరి పోయిన శిష్యులు ఇరువురును మఠమునకు రెండున్నర ఆమడలదూరముననున్న చెఱువుకట్టమీఁదికి సూర్యోదయమై నాలుగుగడియలప్రొద్దెక్కునంతలో దారితప్పకుండపోయి చేరి ఆబూడిదగుమ్మడికాయలనుజూచి చాలహర్షించి, ఆసంసారివచ్చునంతవఱకుఅక్కడనేకాచియుండిరి, వాఁడురాగానే ఓపుణ్యాత్ముఁడా! నేను కొంచెముసేపునుండి కాపెట్టుకొని యున్నాము. మాగురువులకు మంచిజాతిగుఱ్ఱముదొరకక ఒకగ్రుడ్డును నీయొద్దనుండి కొనుక్కొనిపోవలెనని వచ్చినాము. మాయందు దయయుంచి మంచిదిగా నొకగ్రుడ్డుచూచి కొంచెపువెలకేయిప్పించవలెను అనిపలికిరి. వాఁడు వీరి మూఢత్వమునకు తనలో నవ్వుకొనుచు, అయ్యా ముందే మీరు కొంచెపువెలకేయిమ్మనుచున్నారే! యీయుత్తమజాతిగుఱ్ఱపుగ్రుడ్లకు తగుపాటివెల మీరియ్యఁగలరా? మంచిదిగా కావలసినపక్షమున ఒక్కొక్కటి ఇరువదివరహాలకు తగ్గదే అనఁగా, అజ్ఞానశిరోమణి, పోనయ్యాపో-ఇవి అయిదేసివరహాలకు ఒక్కొకటియని ముందే వెలనిష్కర్షచేసియుండిఊరికిపోయివరాలు తెచ్చునంతలోనిన్ని సాధనబేరాలా? బాగుగా ఆమేరకు అయిదువరహాలుపుచ్చుకొని ఒకమంచిగ్రుడ్డునుమాకు ఇచ్చివేయుము. ఇందులో నూఱొల్లు చెడిపోవు. ఈసొత్తో పరమానందగురువులది. లేనిపోని

ఆశలు పెట్టికొని అధికముగాపుచ్చుకొన్నను దక్కఁడు. అనఁగా వాఁడు మితిమీఱివచ్చుచున్న నవ్వునులోపలఆఁప లేక పకపక లాడుచు అయ్యా ఆలాగా మీరు మిగులగొప్పవారని తోఁచుచున్నది. మీరిచ్చినదే నూఱువరాలుగాని మీయిష్టము చొప్పున అయిదువరహాలిచ్చి ఈగ్రుడ్లలో మీమనసువచ్చిన దానినిమీరు తీసికొనిపొండు. ఇంతనయముగానే నిచ్చిన వర్తమానముమాత్రము ఎవరితోఁ జెప్పఁబోకుఁడు అని పది గొప్ప కాయలను కోసికొనివచ్చి వారిముందర దొర్లించెను అంతట వారుమిక్కిలిసంతోషించి తాము తెచ్చిన వరహాలు వానిచేతఁ బడవేసి వానిలో పెద్దకాయ యొకటి యెత్తుకొని యందుండి బయలుదేఱిరి. అప్పుడు నిరక్షరకుక్షి ఆగుఱ్ఱపుగ్రుడ్డును తల మీఁదపదిలముగాఁ బెట్టుకొని నడవసాగెను. అజ్ఞానశిరోమణి వానికి ముందు దారిచూపుచు నడచెను. అట్లుబయలుదేఱి పోవునపుడు నిరక్షరకుక్షి, ఓ చెలికాఁడా! మనభాగ్యమే భాగ్యము ''ఈఁతగింజ యిచ్చి తాటిగింజలాగును'' అనుమాట మనయెడ సార్థకమాయెను. లేనియెడ యిటువంటిగ్రుడ్డు నింత సులభక్రయమునకు ఎవరికిలభించును. మనగురువులవారుమహా తపస్సంపన్నులుగనుక వారితపస్సేయిట్లుఫలించినది. అనఁగా విని, అచేతనతిలకుఁడు, అందుకు సందేహమేమి? ''చేసికొన్న వారికిచేసికొన్నంతమహాదేవా'' అన్నట్లు ఎవరికిని మంచిసెబ్బరలు ఫలకాలములోనేగాని మొట్టమొదట తెలియఁబడవు. మనకు దీనివల్ల విశేషలాభముమాత్రము కాదు. మంచి పుణ్యముకూడ గలుగును. లోకమునందు పెద్దలశుశ్రూష

వలన పుణ్యముకలుగును. ఆ పుణ్యమువల్ల సుఖముకలుగును. సుఖమువల్ల ప్రాణులందు ఆదరము కలుగును, దానివలన మంచికీర్తికలుగును. అని పెద్దలు చెప్పుదురు. కాఁబట్టిమనకు సర్వవిధముల నీ గ్రుడ్డును కొనిపోవుట మేలేగాని మఱి యొకటికాదు. ముందుమాతండ్రి యెంతోకాల మెన్నెన్నో వ్రతములు అతినిష్ఠతో ఆచరింపఁగాఁగదా నావంటి సత్పుత్రునిఁగని ఆనందించినాఁడు. అనఁగా నిరక్షరకుక్షి, ఔనౌను "విత్తొకటి వేసిన చెట్టొకటి మొలచునా?, 'మేలుచేసినవారికి మేలుకలుగును, కీడుచేసినవారికి కీడేకలుగును. అని యీ విధముగావీరుముచ్చటలాడుకొన్నుచు అడవినడిమిదారినిబడి పోవునపుడు ఒకచోట మిక్కిలి వ్రేలుచున్న వాలుగొమ్మలుగల ఒకచింతచెట్టుక్రిందుగా దూరిపోవలసివచ్చెను. అందులకై కొంచెముతలవంపఁగా నిరక్షరకుక్షి పదిలగా నెత్తి నుంచుకొనివచ్చుచున్న గుఱ్ఱపు గ్రుడ్డు దొర్లి దారివెంబడి జేబుకొని యున్నపొదలోఁబడి పగిలెను. అందులకు ఆపొదలో నొదిఁగియున్న కుందేలు అదిరిపడిలేచి పరుగెత్తసాగెను.

అంతట వారిద్దఱును చంకలు తట్టుకొనుచు అదిగో గ్రుడ్డు పగిలెను. పిల్లలేచి పారుచున్నది చూడు. దీనిని తఱిమి పట్టుకొని పోవలెఁగాని విడిచిపోరాదు. రారమ్మని ఒకరినొకరు పిలుచుకొనుచు దానిన్నివెంబడించి తరుమసాగిరి. అట్లు తరుముకొని వా రిరువురు నిదిమిట్ట యిదిపల్లము ఇదిచెట్టు ఇదిగుట్ట అనిచూడక కట్టుబట్టలుం పరికకంప పుట్టలలో తగులుకొని బాలెలు బాలెలుగాఁ జినిఁగిపోవుచున్నను

ఎండినకట్టెమోట్లు తాకి తోళ్లులేచిపోయిన కాళ్ళలో సూది గ్రుచ్చ నెడములేక ముండ్లడుచుకొన్నను, పెద్దపెద్ద ముండ్ల మండలు గీఱుకొని మేనిచర్మముఁజీలి నెత్తురు ధారలుధారలు గాఁ గారుచున్నను లక్ష్యముచేయక వెనుకముందుచూడక పారిపారిడస్సి, గుండెలు కొట్టుకాడగా అడుగులుతడఁబడఁ గా చెవులుగింగురుమనఁగాపరుగెత్తలేక ఒకచోటచదికిలఁబడి తాము గుఱ్ఱపుపిల్లయని తలఁచిన కుందేలుపోయిన పోకడ గానలేక, ఎట్లయిన ఆగుఱ్ఱపు పిల్లనుపట్టుకొనిపోవుట మంచి దనీ మరలకొంచెము ఓపిక కలుగఁజేసికొని లేచి మెల్లమెల్లగా చెట్టుచెట్టు పుట్టపుట్ట చొచ్చి చూచుచు సాయంకాలముదాక అడవులన్ని తిరిగితిరిగి, తుదకువిసుకుపుట్టి మఠముదారిఁ బట్టి, 'అబ్బబ్బా అమ్మమ్మా' అనుచు ఔరా! గుఱ్ఱపు గ్రుడ్డా ఎంత చేసితివేఅనుచు, స్వామి గురురాయా! మీపాదారవిందములను జేర్చుకొరయ్యా, అనుచు, ప్రొద్దుగ్రుంకినజామునకు మఠము వచ్చిచేరి, ఉస్సురని నిట్టూర్పులు విడుచుచు తమ గురువు పాదములఁ దలలు సోఁకునట్లుబడితలు పడినట్టు బబ్బునబడిరి, అదిచూచి గురువును అతనియొద్దనున్న ముగ్గురు శిష్యులును ఏమిఏమిగుఱ్ఱపుగ్రుడ్డు ఏమయ్యెను, మీకింతటియాపదరానేల అని తత్తఱపాటుతో నడుగఁగా వారేమిచెప్పను నోరురాక చచ్చినపీనుఁగులవలె ఊపిరిపుచ్చుటకుఁగూడ శక్తిచాలక ఊ రక పడియుండిరి. అప్పుడు విపరీతనిపుణుఁడు అయ్యో నాయ న్నలారా! పోతిరాఅని యేడ్చుచు లేచివచ్చి, చెవులలోయూఁది దూది పెట్టి ముక్కుగాలిపరీక్షించి, ఊపిరి యున్నట్టున్నది,

ఒకవేళ తెప్పరిల్లుకొన్న తెప్పరిల్లుకోవచ్చునని యనిపలుకుచు, చంకలలో చేతులుచొప్పించి లేవనెత్తియిరువురినిగూర్చుండఁ బెట్టెను. అంతటవారు కళఁదెలుపుకొని, దడమెత్తివశముగాని ఒడళ్లను వశపఱచుకొని గగ్గుత్తికపడిన గొంతులుసవరించు కొనుచు, తమ యవస్థయంతయు సవిస్తరముగాఁజెప్పిరి. అది విని మూఢజనేంద్రుఁడు గురువునుజూచి, స్వామీ మనకా గుఱ్ఱపుపిల్లపోబడి లేకపోయిన దేమంచిది. అదిచిక్కియేయున్న పక్షమున వీరుపట్టుకొనివత్తురు అంతట మీరును హాషించి దానిని[ప్రొ]దిగాపెంతురు, పుట్టుకలోనే యెంతో వడిగాఁబా ఱిన యాపిల్ల యెక్కఁదగిన యీడు వచ్చునప్పటికి మేఘాల మీఁద ఎగసిపోవుచుండేది కాకపోదు. అట్టిగుఱ్ఱమునెక్కినతరు వాత మీరు మాకు దక్కుదులాఅనెను. అందులకుఅజ్ఞానశిరో మణి శిరఃకంపముచేయుచు గురురాయా! అతఁడు చెప్పినదే సత్యము. నేను పుట్టి బుద్ధెఱిఁగి ఇంతవేగముగల గుఱ్ఱపుపి ల్ల కలదనఁగా వినియెఱుఁగను. చూచియునెఱుఁగను. అదిగ్రు డ్డునిచ్చిపోగానే చెంగనాలుదోలు చూపారెను. అప్పుడు అది చూపునకు బలిసినకుందేటివలె మూరెడుఎత్తుగలిగె యుండెను అనెను.

అదివిని తక్కినవారు ఇంతప్రమాదమువచ్చునని తెలి యక వ్యర్థముగా అయిదు వరహాలు పోగొట్టుకొంటిమే యని తలలు వేలవేసికొని విచారపడుచుండఁగా, గురువు వల యీపనికిమాలిన విచారము, వెనుకచింతించుట వెఱ్ఱి తనము. అయిదువరహాలేగదా ఎక్కడపోలేదు, ఎక్కడ

రాలేదు. అదియొక లెక్కగానెంచి విచారపడకుఁడు. మన మూఢజనేంద్రుఁడు చెప్పినట్టు ఆగుఱ్ఱపు పిల్ల పోయినదే మంచీది, అందుకు మీరు సంతోషింపవలెఁగాని చింత నొందరాదు. అది చిక్కియేయున్న యెడల అయిదువరహాలుపెట్టి మృత్యువును కొనితెచ్చుకొన్నట్లవును. దాని నెక్కి యెవఁడు మనఁగలడు. అదిగాక నేను లేవలేని ముసలివాఁడను. నాకుఁ దగువ తట్టున ఒకటి యెక్కడైపరు దొరకకపోదులే అనెను. అదివిని అందరును హర్షించి నిర్విచారులై యుండిరి.

# మూడవది

## బాడిగ యెద్దు నెక్కి యాత్ర చేసినకథ

అంతటఁగొన్నాళ్లకు పరమానందయ్యగారు దూర దేశయాత్ర చేయ యత్నపడిరి. అప్పుడు శిష్యులు గురువునుజూచి స్వామీ! మీబోఁటివారు వాహనము లేక దూర దేశయాత్ర చేయఁబోయిన గౌరవముగా నుండదు. ఎక్కడనైన ఒక గుఱ్ఱమునుగాని లేక, ఒక గంతయెద్దును గాని సంపాదించుకొని పోవలసినది. ప్రకృతము క్రయమునకు చిక్కకఁబోయినను బాడిగకైన ఒకదానిని కుదుర్చుకొనుట మంచిది అని చెప్పిరి. అందులకు గురువు సమ్మతించెను. పిమ్మట దినమొకటింటికి ముద్దుగులము చొప్పున బాడిగ నిష్కర్ష చేసి ఒక గంతయెద్దును కుదుర్చుకొని మఠమునుండి గురువును శిష్యులును బయలుదేఱిరి. ఆ బయలుదేఱునప్పుడు ప్రయాణసన్నాహ మంతయు అగుటకు జాము ప్రొద్దెక్కెను. అది

వేసంగికాలము. ఎండ సహింపరాని వేండ్రము గలిగి కాయుచుండెను. ఆయెండలో నిలువ నీడగాని త్రాగను నీళ్లుగాని చిక్కని యెడారిలోఁబడి పోవలసివచ్చెను. ఆ యెడారిలో చిక్కుకొని ఎండచేత గురువు కూరకాఁడవలె వాడి యెద్దుమీఁద నిలువలేక వ్రేలఁబడెను. అదిచూచి శిష్యులు ఆయనను మెల్లగా దించి నిలువను నీడగానక ఎద్దువానిని మంచి మాటాడి, ఎద్దును నిలువఁబెట్టి దానినీడలో గురువును గూర్చుండఁబెట్టి చుట్టుఁ జేరి ఆయనను నేలకు వాలకుండఁ బట్టుకొని ప్రొద్దువాటు వాలునంతదాఁక పైబట్టలు కుచ్చుగాఁ గట్టి మెల్లగా వీచుచుండిరి. అప్పటికి చల్లగాలిమళ్లగాఁ గురువునకును బడలికతీఱి కొంచెము లివవచ్చెను. అంతటఁ దిన్నగా ఆయనను ఎద్దుమీఁదఁ గూర్చుండఁబెట్టుకొని మెల్ల మెల్లగా నడచిపోయి ప్రొద్దు గ్రుంకునంతలోపల ఒకయూరుఁ జేరి అచ్చట ఒక ధర్మపుచావడిలో దిగి, ఎద్దును దెచ్చినవానికి నిష్కర్ష మేరకు ముద్దుగులమును ఇచ్చివేసిరి. వాఁడు ఆపైక ముపుచ్చుకొని ఇఁక యెండలో గురువునకు గొడుగుగా ఎద్దును నిలిపినందులకు కూల యింవు అని నిర్బంధించెను. వారు మేము అందుకై ఒక నిబంధన యేర్పఱచుకోలేదు. మంచి మాటగా అడుగుకొన్నందుకు ఉపకారార్థముగా ఎద్దును నిలిపితివి, అందుకై కూలియడుగుట మిక్కిలి యన్యాయము. అని ఘోరుమేళము [illegible]కొని జగడ మాడసాగిరి. ఆ వేడుకను జూచుటకు ఆయూరివారందఱువచ్చి ముసురుకొనిరి. అప్పుడు ఒక పెద్దమనుష్యుఁడు వీరి వృత్తాంతమంతయువిని

తోడ ఇచ్చుటయుఁగలదు. అది తెలిసియు నేను సామాన్యుల వలె తేర కూటికి ఆశించుట గౌరవముగాఁదోఁచక పోనందు నను, కావలసిన పదార్థములు కొని తెచ్చి వండుకొని భోజ నము చేయవలెనన్న అది రాత్రికాలముగా నున్నందునను, చేతకాసు[illegible] పోయినందునను, చేతిలో కొంచెము చల్ది యుండినను అది తెల్లవారి తినవచ్చునని ప్రాలుమాలి ఆసత్ర ములోనే ఒకమూల నూరకపండుకొంటిని. అటుపిమ్మట అనే కులు బాటసారులు, పరదేశులు అచ్చటవచ్చి దిగిరి. అందు కొందఱు బాటసారులు కట్టెలు తెచ్చిమంటవేసి వేటమాంస మును యినుపసలాకలతో గ్రుచ్చి వ్రేలఁబట్టి కాల్చుచుండిరి. ఆవాసన ముక్కుకుసోఁకగానేనాకుఁగలిగినప్రాలుమాలిక యం తయు తొలఁగిపోగా, ఈవాసనతోనే చేతనున్న యన్నము తినవచ్చునని లేచిమెల్ల మెల్లగా ఆమంటయొద్దపోయికూర్చుండి ఆవెలుఁగున భోజనము చేసితిని. అట్లు భోజనము చేసి అందుండి యీవలకువచ్చుచుండఁగా ఆసత్రపు కావలివాఁడు వచ్చి "ఓ పుణ్యాత్ముఁడా! నీవు మాసత్రమునందు వ్యాపించిన వాసనను పట్టుకొనిభోజనము చేసితిని. అందులకై మాకుబాడిగ నియ్య వలసినదని యడిగెను. అంతట నేను ఇదియేమి విపరీతముబాట సారులను అనుసరించి నేనుభోజనము చేసితిని. ఇందుకుఁగాను వీనికిబాడిగ యిచ్చుటయనః నెటువంటిది. ఇదిచాల అన్యా యము. వీరుయిదిధర్మసత్రము అని పేరుపెట్టివచ్చువారిని పోవు వారినిరాఁబట్టి దోఁచుకొనునట్లు తోఁచుచున్నది" అని కేకలు వేయుచు ఆ యూరియధికారివద్దపోయి చెప్పుకొంటిని. ఆయధి

కాని మిక్కిలి తెలిసినవాఁడు. అతిసమర్థుఁడు. మహానీతిపరుఁడు కాఁబట్టి నామనవినాదరించి కూరతినినందులకు క్రయమును. కూరయొక్క వాసన పట్టినందులకు అక్రయముయొక్క వాసనయు యియ్యఁదగినవని తీర్పుచేసెను. అంతట నేను సత్రపు ధనపుమూటను వానిముక్కు దగ్గఱనుంచి చక్కఁగా వాసనపట్టు కొమ్మని నాకసిదీఱ నణఁచిపట్టి రుద్దితిని, వాఁడు ఆనొప్పికి తాళలేక చాలును చాలును బాడిగయని మొఱపెట్టుచు పట్టు తప్పించుకొని తొలఁగిపోయెను. కనుక, యెద్దునెక్కి వచ్చినందుకు బాడుగయు, దానినీడకు బాడిగయాకల నీడయు నియ్యఁదగునని చెప్పి, ఇప్పుడు సూర్యాస్తమయమయ్యెను. కనుక నీడ కానఁబడదు. ఆ యెద్దునకియ్యవలసిన బాడుగపయికమును ఒకతిత్తిలోవేసి దానిశబ్దము వాని చెవులకు చక్కఁగా వినునట్లు కొట్టి చూపుఁడనఁగా, వారునట్లేచేసిరి. అంతట బాడిగయెద్దు వాఁడు అయ్యా నాకునీడబాడిగ వచ్చినది. ఇఁక అక్కఱలేదు. చాలునుచాలును అని చెవులు తడవుకొనుచు తనయెద్దును తోలుకొని తొలఁగిపోయెను. ఈ గురుశిష్యులు పెద్దమనుష్యుఁడు తీర్చిన తీర్పును శ్లాఘించుచు నింతటి పుణ్యాత్ములు కొందఱు లోకములో నుండకున్న వానయైనకురియునా అని అతనినిగొనియాడి, వీనియెద్దుతోడిపోరువాలును రేపటిప్రయాణమునకు సాగుమార్గము తెల్లవాఱి విచారించుకొంద మనియెద్దు వానినిపంపించివేసి, అప్పటికి తగినట్లు స్నానసంధ్యాధ్యానుష్ఠానములు తీర్చికొని వంటభోజనము చేసికొని పండుకొనిరి.

# నాలుగవది.

## నీళ్లలోని గుఱ్ఱమును బట్టుటకు గాలము వేసిన కథ.

మఱునాడు ఆగురుశిష్యులు తెల్లవాఱినయెడ యెండ వేండ్రముసహించుట కష్టమని వేకువజామున కోడికూయఁగనే లేచి ప్రయాణము సాగించిరి. వాహనమేమియు లేక మెల్ల మెల్లగా నడచిపోవుటచేత దారిసాగక నేదేనియొకయూరు చేరఁబోవునంతలోనే ప్రొద్దు పొడిచి జాముప్రొద్దెక్కెను. అంతట గురువు దారివెంబడి ఒక చెఱువును దానికట్టక్రింద చల్లని నీడగలిగి నిర్మలముగానున్న యొకమామిడి తోపును జూచి, "ఎండపడినది ఇఁక ఈయెండలో మనము నడువనేరము ఈతోపులోదిగి వంట, భోజనముచేసికొని మార్గాయాసము తీఱునట్లు ఎండ చల్లఁబడునందాఁక నిచ్చటనుండి ఆవల లేచి మెల్లగా ప్రొద్దుగ్రుంకునంతలో నేదేని యొక యూరు చేరఁబారుదము" అనిచెప్పెను. అందులకు శిష్యులొప్పుకొని నిలిచిరి. అప్పుడు అజ్ఞానశిరోమణి బహిశ్శంకతీర్చికొనువాఁడై యెడముగాఁబోయి ప్రక్షాళనమునిమిత్తము చెఱువులోదిగెను. వాఁడు దిగినచోట కట్టమీఁద నొకదేవాలయమును దాని వాకిట క్రొత్తగా బచ్చెనపూసి యెండఁబెట్టినఒకగుఱ్ఱపువాహనమును ఉండఁగా వానియాకారములు ఆచెఱువునీళ్లలోఁ బ్ర ఫలించుచుండెను. వీఁడు కాళ్లుకడుగుకొనఁబోవుచు ఆగు నీడనుజూచి, ఔరా! ఈచెఱువులో నెంత మంచి దిగిపట్టుకొనిపోయినమనగురువులవారికిఉప

అని నీళ్లలోదిగి రెండడుగులు పెట్టఁగా నీళ్లుకదలి గుఱ్ఱపు నీడయు కదలునట్లు తోఁచెను. అంతట వాఁడు ఇది లోఁతు నీళ్లలోనికిఁబోయినది. ఇంక పట్టుకొనుట దుస్తరము నీళ్ళు వెడలఁదోలిన నలుగురుచేరి మెల్లగాఁబట్టుకోవచ్చునని 'ఛీఛీ' యని యందలించుచు నీళ్లలో ఱాళ్ళు రువ్వసాగెను. అందువల్ల నీళ్ళుకలఁగి అలలుగొట్టఁగా ఆనీళ్ళలోని గుఱ్ఱము బెదరి తత్తఱముతో చొకళించి దాఁటుచున్నట్టు కాన వచ్చెను. అదిచూచి మిక్కిలి యుత్సాహముతో కేకలు వేయుచు తమవారున్నచోటికిఁ బరుగెత్తిపోయి తాను జూచిన గుఱ్ఱముయొక్కస్థితిని వారికందఱికి తెలియఁజెప్పెను. వారు వానికంటె బుద్ధిమంతులుగనుక దానిని చూడవలెనని నొకరివెంట నొకరు పిలపిల లేచిపోయి, అజ్ఞానశిరోమణి చెప్పినదానిని ప్రత్యక్షముగాఁజూచి, దీని ఊరక పోనియ్య రాదు, ఎట్లయినపట్టితీసికొని పోవలసిన దని నిశ్చయించి, నీళ్ళలోదిగి యాఁది పట్టుకొనుటకు ధైర్యము చాలక తమ తమకుఁ దోఁచిన యుపాయములను పన్ని చూచి, ఎందునను సాధ్యముకాక తుదకు గాలమువేసి పట్టునట్లు నిర్ణయించు కొనిరి. అయినను ఆయడవిలో వారికి గాలము ఎక్కడ చిక్కును. గాలమును సంపాదించువిషయమునను ఆలోచన పుట్టెను. అప్పుడు విపరీతనిపుణుఁడు గాలనమునకై యింత యోచింపనేల? ఒకవేళ యెక్కడికైనపోయి కొనుక్కొని రావలెనన్నను, చిన్నదిగానుండును గనుక చిన్నచిన్న చేఁప లను పట్టుటకేగాని యింతపెద్దగుఱ్ఱమును బట్టుటకు అదియుప

యోగింపఁబోదు. "మనము కూరగాయలు తఱుఁగుకొనుటకై తెచ్చుకొన్నకొడవలి గాలముగాను ఈపూటకు తెచ్చుకొన్న చల్దిమూట ఎరగాఁజేసి మనగురువులపాగాకొనను గట్టి ఊంటగాలము వేసినట్లు వేసి లాగితిమేని గుఱ్ఱము ఆయెరకు ఆశ పడి చిక్కుకొనును" అని చెప్పెను. అదివిని యిది మంచి యుక్తియని యందఱును శ్లాఘించి యట్లే చేసిరి. ఆ యన్నపు ముద్దతోఁ గూడ అది వెంటనే నీళ్ళలోఁబడఁగానే నీళ్ళు కలఁగి తత్తళింపఁగా అందున్నగుఱ్ఱము త్రుళ్లిపడి చౌకళించి దాఁటుచుఁ దమ్ముఁ గఱవవచ్చినటుతోఁచెను. అందులకు వెఱచి యందఱును దూరముఁ బరువెత్తఁగా పాగా కొన పట్టుకొనియున్న విపరీత నిపుణుఁడుమాత్రము పట్టువదలక గడగడవణఁకుచు కట్టయెక్కి నిలువఁబడి యుండెను. అటు పిమ్మట కొంతసేపటికి నీళ్ళలోని చేఁపలు వీరువేసిన చల్దిమూటను పట్టి లాగసాగినవి. అది గుఱ్ఱము ఎర లాగుటగా నెంచి విపరీతనిపుణుఁడు కొంచెము బెదరు తీర మెల్లమెల్లగా తన్నుఁజేరవచ్చుచున్న తమవారిని జూచి గుఱ్ఱము ఎరలాగుచున్నదనువిషయము వారికి బోధపడునట్లుగా సైగచేసెను. అంతట నలుగురు చేరవచ్చి తలపాగాను పట్టిలాగిరి. గాలముగా కట్టివేసిన అకక్కుల కొడవలి నీళ్ళలో దట్టముగా అల్లుకొనియున్న పాఁచితీఁగలలోఁ దగులుకొన్నందున కొంచమున రాకపోఁగా గుఱ్ఱమునోటిలో గాలము తగులుకొన్నది సళ్ళువదలక లాగుడు" అని యొకరికొకరు చెప్పుకొనుచు బలవంతము గాఁబట్టిలాగిరి. ఆపాగా ప్రాఁతదియైనందునను భల

వంతముగాలాగినందునను సగమునకుఁ జినిఁగి వీడివచ్చెను. దానిని లాగుచున్న గురుశిష్యులు ఆరుగురును ఒక్కసారిగా పట్టుపదలి వెలికిల బడిరి.

అప్పుడు ఆదారినబోవుచున్న బాటసారియొకఁడు పీరి పాటునుజూచి యిదియేమియని యడుగఁగా జరిగినవృత్తాంత మంతయు విశదముగా నతనితోఁజెప్పిరి. వాఁడువిని నవ్వుచు ఇప్పుడు ఆగుఱ్ఱము ఉన్నదుతావును చూపించెదను రమ్మని గుడివాకిట ఎండుచున్న గుఱ్ఱపు వాహనమునకు తినపై వస్త్రమును అడ్డముగాఁబట్టి నీళ్ళలో చూడుఁడు అనెను. వారు ఆనీళ్ళవైపు చూడగా ముందుగుఱ్ఱమును జూచిన తావున వస్త్రమును అడ్డముగాఁ బట్టుకొని నిలుచున్న బాట సారి కనఁబడెను. అంతట నీళ్ళలో గుఱ్ఱముయొక్క నీడయని తెలిసికొని తమ ప్రయాసమునకు దుఃఖించుచు శిష్యులందఱు గురువును అతనికిఁజూపి, 'ఓ పుణ్యవంతుఁడా! వీరు మాగురు వులు. మిక్కిలివృద్ధులు. ఒక యడుగైన నడవలేక శ్రమ పడుచున్నారు. వీరికి గుఱ్ఱమొకటి కావలసియున్నది. విశే షించి ద్రవ్యసంపత్తి లేనందున మంచి గుఱ్ఱమును తీసికొను టకు శక్తిలేక ముందొక గుఱ్ఱపుగ్రుడ్డుఁదీసి దానిని వ్యర్థ ముగా పోఁగొట్టుకొంటిమి. అటుపిమ్మట ఒకయెద్దును బాడి కకు పట్టుకొనివచ్చి ఆయెద్దుగలవానివల్ల ఎంతో విసుగుపడి తిమి. అని తమవృత్తాంతమంతయు అనుపూర్విగా వానితో చెప్పిరి. వాఁడు అదంతయు అఖ్లవిని దయపుట్టి, మీరు కొంచెమయిన కపుటు తెలియనివారు. మిక్కిలి మంచివారు.

మీవంటివారికి సహాయము చేయుట మంచిదని నాకు తోఁచు చున్నది. అయినను నేను విశేషసహాయము చేయఁజాలిన వాఁడనుగాను. నాయొద్ద యొకకుంటి ముసలిగుఱ్ఱమున్నది. అది మీకు పనికివచ్చునెడ నిచ్చెదను తోలుకొని పొండు అందుకుఁగాను నాకు డబ్బుదుగాని యియ్యనక్కఱలేదు. పోచికోలుగానే పుచ్చుకొనుఁడు. అనిచెప్ప, వారు యెటువంటి దయిన ఒకగుఱ్ఱము ఉండుట మంచిది. అదియు పోచికోలు గానే వచ్చునట్లున్నది అని సంతోషించి, అయ్యా! అంత మాత్రము పుణ్యముఁగట్టుకొమ్మని తన్ను వెంబడింపఁగా వాఁడు వారిని తమయూరికి పిలుచుకొనిపోయి, తాను ద్రవ్య వంతుఁడు కాకపోయినను ధర్మాత్ముఁడు గనుక వారికి ఆ పూఁటకు కావలసిన భోజనపదార్థములతోఁ గుఱ్ఱము నిచ్చిపంపెను. వారు దానిని పుచ్చుకొని ఆరాత్రి యచ్చటనే వసియించిరి.

## అయిదవది

### గుఱ్ఱము నెక్కి యాత్ర చేసిన కథ.

మఱునాఁడు ప్రొద్దున గురువు గుఱ్ఱమును తనయెదు టికి తీసికొని రమ్మని శిష్యులకు ఆజ్ఞాపింపఁగా వారు దానిని మేయవిడిచియుండిరి గనుక తలాయొకవైపుపోయి వెదకితోలు కొనివచ్చి గురువునెదుట నిలిపిరి. అప్పుడు గురువు దానిలక్ష ణములన్ని చక్కఁగా పరీక్షించి, ఇది కొంచెము ముదిప్రాయ ముగలదిగానున్నను మనకు తగినగుఱ్ఱమే. అవయవమ్ములలక్షణ మున్నవో నెడమకన్ను కుడిచెవితప్ప తక్కినవన్ని సరిగానే

యున్నవి. ''అయిననేమి పోఁచికోలుగానేకదా మనకు దొరికె
నది. అయినను దీని నడకయేమాత్రమో చూతము. నడ
పింపుఁడు'' అనెను, అనఁగానే విపరీత నిపుణుఁడు కళ్ళెము
ఉండినగదా సవారిచేసి చూడవచ్చును'' అని యిటు నటు
తిరిగిచూచి అచ్చట ఒకదుక్కిటాకు కనఁబడఁగా తీసికొ
వచ్చి దానిమోరయెత్తి మెల్లగా నోటిలోనికి చొప్పించి
క్రింది పెదవికి పెనచికట్టి లాగఁగా, తక్కిన నలుగురును
నాలుగు బడితలెత్తిమోఁదిరి. అంతట అదిపడుచు లేచుచు
నాలుగు బారలదూరము పరుగెత్తెను. అదిచూచి గురువు
సరి యిది మనధాటికి మీఁఱఁజాలినది కాదు. ముందరికాలు
ఒకటిమాత్రము కుంటిగా నున్నట్టున్నది, వెనుక కాళ్ళు పరి
పాటిగా ముట్టుకొనుచున్నవి. అయిన నేమాయెను? మనము
సూటార్లు యిచ్చికొల్లపోతిమా? ఆమహారాజు మనలను గౌర
వించి యిచ్చినాఁడే అంతియేచాలును. గురువులని వేరుపెట్టు
కొని గుఱ్ఱమున కేగతిలేకున్న నగుబాటుగా నున్నది. ఊరక
లేనిపోని శంకలుపెట్టుకోరాదు. ఇఁక దీనికి కావలసినగంత,
కళ్ళెము, అంకెములు మొదలయినవానిని సంపాదింపుఁడు--
అని శిష్యులను మందలించెను. శిష్యులును అందులకు
హర్షించి ఒకఁడు దానిచుట్టుదిరిగి దేహమును నిమురసాగెను.
మఱియొకఁడు దానికాళ్ళు పిసుక మొదలుపెట్టెను. ఇంకొ
కఁడు దానితోఁకపట్టిలాగివిడిచెను. వేఱొకఁడు కన్నులు
తుడువ నారంభించెను. మఱియునొకఁడు పచ్చికపెరుకుకొని
వచ్చి దానినోటికి నందియ్యఁబోడగెను. ఇట్లు అయిదుగురు

శిష్యులను గుఱ్ఱమునకు తమకుఁదమతోఁచినయుపచారములను చేసి, తోలునాడు గుఱ్ఱమునిచ్చిన పెద్దమనుష్యుని యొద్దకుఁ బోయి, "అయ్యా పుణ్యాత్ముఁడా! గుఱ్ఱము నిచ్చినట్టె దానికి కావలసిన జీవి మొదయినవానినిగూడ నిచ్చిపుణ్యము గట్టుకోలేవా" అని అడుగఁగా, అతఁడు తన యింట చెదలుపట్టి పడి యున్న యొక ప్రాఁతగంత మొదలైనవాని నిచ్చిపంపెను. వారు అవి దీసికవచ్చి గంతకు వెనుక వారు లేకపోఁగా దానికి చెడుపడుతీఁగ్గలు పెనఁచికట్టియు, కళ్ళెమునకువాఱు తెగిపోఁగా తాటినారతడపలు ముడిపెట్టియు, తంగువాఱు అంకెపువాఱు లేకపోఁగా కొందఱు సంసారులను అడిగి ప్రాఁత పగ్గములు ఒకటిరెండు తెచ్చి సరిపెట్టియు గుఱ్ఱపు సవరణ లన్ని అమర్చుకొని గుఱ్ఱమునకు జీని వేసి సిద్ధపఱచిరి అంతట జోస్యులు నిర్ణయించిన సుముహూర్తమునందు పరమానంద గురువు గుఱ్ఱము నెక్కి ప్రయాణమాయెను.

అప్పుడు శిష్యులయిదుగురును ఒకఁడు ముందుకళ్లెము పట్టుకొని లాగుచు నిరువురు రెండుప్రక్కలను అంకెము లను బట్టుకొనియు గుఱ్ఱమును నడిపించుచురాఁగా అందఱకు ముందొకఁడు హెచ్చరికపరాకు, అని పరాకు తెలుపుచు నడచెను. వీరు పోవుచుండఁగా సుంకరియొకఁడు వచ్చి గుఱ్ఱమునకు నయిదుటంకములు సుంకమిమ్మని అడ్డగింపఁగానే వారు అందఱును ఏకవాక్యతగా గురువెక్కినగుఱ్ఱమునకుఁ గూడ సుంకమా! ఇది న్యాయముకాదు. వ్యాపారార్థము పోవు వారి వలెనట్లు మమ్ము సుంక మడుగకుము. మేము ఒక

మహారాజు దయచేసి యినాముగా నిచ్చిన యీముసలిగుఱ్ఱమును మీఁద మహాజ్ఞానులును అతివృద్ధులయిన జగద్గురువులను సహింపఁజాలరని యెక్కించి తోలుకొనిపోవుచున్నాము. కనుక నోరు మూసికొనివచ్చినదారిని పొమ్మనిచెప్పఁగా, సుంకరి "సెబాసు" తేరమాటలాడియూరకొనఁదలఁచితిరో యీమంత్రాలకు మామిడికాయలు రాలవు, నేను సుంకరిబిడ్డను, అయిదు టంకములు కక్కించి మఱివిడుతునను కొనుండు అని వాఁడెంత వేడుకొన్నను అడుగెత్తి యావల పెట్టనీక నిర్బంధపెట్టెను. వారును "మొండివేసిన మగఁడేమి చేయును. దండుగవచ్చిన నగర వారేమి చేయుదురు" అని మిట్టమధ్యాహ్నము అగునంతవఱకు మొండొడ్డి నిలిచియుండియు, తప్పించుకొను మార్గముఁగానక వాఁడు అడిగినచొప్పున సుంకము అయిదు టంకములను నిచ్చి, ఈగుఱ్ఱము నపేక్షించినందున గదా! ఇంత తొందరపడవలసివచ్చెను అని గురువు విసుగుకొనుచుండగా సుంకరియడ్డగించిన ప్రదేశమునకు దాపుననున్న యొకపల్లెకుఁ బోయి యచ్చట బాటసారులు దిగుచున్న ధర్మపుజావడిలో దిగి, శిష్యులు గుఱ్ఱమునక్కడతోలివంట సామగ్రులకై తలా యొకతట్టుపోయిరి. గురువు అక్కడవచ్చి యున్న యొకగృహస్థునితో తనవృత్తాంతము నిట్లు చెప్ప నారంభించెను.

"ఓపుణ్యాత్ముఁడా! నేను ఇంతకాలము బ్రతికియు ఎంతదేశము తిరిగియు ఓపినంతమట్టుకు కాలినడకతోనే కాలము గడిపితినిగాని గుఱ్ఱము నెక్కి యాత్ర చేసి యెఱుఁగను.

గుఱ్ఱముమీఁద యాత్ర చేయు దినములలో మొదటిదినము ఇదే. ఈయొకనాటిలోనే నేను పడినపాటు చెప్పఁదీరదు. ఈ యన్యాయమును వినుము సుంకరివని యొక నడిమి తేరగాఁడు వచ్చి దారిలో మమ్ము నడ్డగించి మేము బత్తెమునకై తెచ్చుకొన్న అయిదు టంకములను దోచుకొనిపోయెను. ఇట్లు సత్రిమాలి త్రోవదోఁచు దొంగలకు మేలెట్లు కలుగును ఇట్టి నిష్ఠుర ప్రవర్తకులకు దైవమెట్లు తోడుపడును? నాకడుపుమంట వానిని తాకదా?' అనెను. అదివిని ఆపెద్ద మనుష్యుఁడు అయ్యా! మీరు కవుడులేని కాలమునందుఁబుట్టినవారు. కనుక మీకు టక్కుపిక్కు తెలియదు. ఈకాలమన్ననో అతి వంచకము. ఈకాల లక్షణము వినుఁడు. పెద్ద చిన్న గురువు దైవము అనుమర్యాద లేదు. ధనమే దైవము ధనమే గురువు. ధనమన్న పీనుఁగు సైతము నోరు తెఱచును. ధనమునకన్న చుట్టము లేదు. ధనమునకన్న ప్రియము లేదు, ఇటువంటి ధనమే ప్రధానమయిన కాలమునందును మీబోటి సాధువులకు నెమ్మది కలుగుట అరిది, యని బహువిధముల నూఱట మాటలు చెప్పఁగా గురువువిని, అవును మీరు చెప్పినది నిజము ఈ కాలపు జనులు అశుద్ధముపైఁబడియున్న రూకనైన నాలుకతో ఎత్తుకొందురు అనఁగా, ఆపెద్దమనుష్యుఁడు ఈవిషయమునందు ఒక కథగలదు వినుఁడని యిట్లనియె-

ఒకరాజు కేవలధనపరుఁడయి తనదేశమునందు లేనిపోని పన్నులు ఎన్నో యేర్పఱుప నారంభించి, తుదకు కాలుమడి పన్నుగూడ ఏర్పఱిచెను. అయినను అది వానికోడుకు

నకు మాత్రము సరియని తోఁచినది కాదు. కాఁబట్టి వాఁడు 'నాయనా యీకంపుపన్ను నడుగుట నాకు చాల లజ్జగానున్న దని తండ్రితోఁ జెప్పెను. అందులకు తండ్రి యేమియు ప్రత్యుత్తరము చెప్పక తనయిష్టము చొప్పునఁ బన్ను వేసి తెచ్చి అందువలన చేరిన ధనమంతయు ఒకచోట రాశిపోసి కొడుకును పిలిచి యీరూకల రాశిని మూర్కొని దీనివలని కంపు ఇట్టిదని నాకు "చెప్పుము'' అనెను. కొడుకు తండ్రిని జూచి యిందు కంపులేదు. పరిమళమే కొట్టుచున్నది అనఁగా, తండ్రి యిదే కాల్మడి పన్ను పైకము అనిచెప్పి సమాధానపఱిచెను.

వింటిరా! ధనము మహిమ, ఏవిధముచేతనైన ఆర్జింప నగుఁ గాని, ఇదియుక్తముకాదు- అనువిచారము ధనవిషయమునందు పాటింపరాదు అనుటయే యిప్పటివారిమతము కనుక యెట్లు లభించినను ధనమువలన సేగిలేదందురు.

అని యీవిధముగా గురువును ఆపెద్దమనుష్యుఁడును ముచ్చటలాడుచుండఁగా, శిష్యులు ఆ యూరిలోతగిన పుణ్యాత్ముల యిండ్లకుఁబోయి కావలసిన వస్తువులడిగి తెచ్చి వంటచేసి, స్వామీ! వంటఅయినది స్నానముచేసి దేవతార్చనముచేయ దయచేయుఁడుఅని గురువును పిలచిరి. అంతట ఆయన ఆయూరి వెంబడి చెఱువునకుఁబోయి యథావిధిగా స్నానముచేసి వచ్చి యెల్లయనుష్ఠానములు తీర్చి కొని భోజనము చేసెను. అంతట శిష్యులును గురుభుక్తశేషమును భుజించి కృతార్థులై మఱల ప్రయాణముఁ జేసిరి.

ఆ ప్రయాణకాలమునందు ప్రొద్దు పడమట వాలియున్నందు నను గుఱ్ఱము వడిగా నడువలేనిదియైనందునను ప్రొద్దుగ్రుంకు నప్పటికి మఱియొక యూరుఁజేరఁజాలక మిక్కిలి భయంకర మైన యొకయడవియందు నాటిరాత్రి నిలువవలసి వచ్చెను. కనుక ఆయడవిలో త్రోవవెంబడి నొక మడుఁగుగట్టున నిర్మల మయిన నొక ప్రదేశమునందుదిగియిదినిర్మానుష్యప్రదేశము, ఇచ్చట గుఱ్ఱమును చక్కఁగా మేపుకోవచ్చును, అని సంతో షించి, గుఱ్ఱమునుకట్టివేయక యథేచ్ఛముగా మేయవిడిచి, హాయిగా అందరును పండుకొని నిద్రించిరి. తూర్పు తెల్ల వాఱఁగానే గురువులేచి స్నానాద్యనుష్ఠానములు తీర్చికొ సాగెను. శిష్యులు యథోచితముగా తాత్కాలానుష్ఠానము లను జరిపికొని ఆవల కదలిపోటకై మేయఁదోలిన గుఱ్ఱ మును వెదుకగా అది కానరాకపోయెను. అంతట శిష్యులు అయిదుగురిలోను ఒకఁడు మాత్రము గురువుయొద్దనుండి తక్కిన నలుగురును గుఱ్ఱమును వెదకువారై పోయి తాము దిగిన నడవికి రెండుక్రోసులదూరమునందున్న యొకయూరి బందెలదొడ్డిలో గుఱ్ఱమునుజూచి, పాపాత్ముఁడా! పరమ పావనులగు పరమానందగురువుల గుఱ్ఱమును అపహరించు కొని వచ్చితివా? చాలుఁజాలువిడువువిడువుమని యాదొడ్డి వాకిట కావలియున్న తలారివానితో కలహింపనారంభించిరి. అందులకా తలారివాఁడు అయ్యలారా! త్రుళ్ళుకుఁడు రాత్రి యంతయు మారెడ్డిగారిచేనుమేసి మీగుఱ్ఱము మత్తెకొని యున్నదిగదా! ఆమత్తే మిమ్ముగూడ యిట్లు మాటలాడించు

చున్నట్టున్నది. అని వారిని తమ గ్రామాధికారియొద్దకుఁ దీసికొనిపోయి, "సామీ! రేయిముప్పదిగడియలు పొలిమేర వెంబడిచేనంత పాడుగా మేసినదని రెడ్డిగారు ఈగుడ్డిగుఱ్ఱమును దొడ్డిలోఁ దోలి నన్నుఁ గావలి పెట్టిపోయినారు. ఇంత చక్కనిగుఱ్ఱము ఎక్కడనుచిక్కదని నేను దొంగతనముగాఁ దోలుకొనివచ్చి దాఁచుకొన్నానట. ఈఅయ్యగారి మాటలు వినుఁడు." అనిచెప్పెను. అంతట ఆగ్రామాధికారి వీరి వృత్తాంతమంతయు విచారించి తెలిసికొని వీరు బుద్ధిపూర్వముగా చేసినవారు కారని నిశ్చయించి, చేనుగలవానిని పిలిపించి, పాపము పరదేశులు గుఱ్ఱమును విడిచిపెట్టుదునా అనెను. అందుకా చేనికాఁపు మండిపడి బాగుబాగు "పొరుగింటజాఁడురా నాపెద్దచేయి" అన్నట్టు మీ ధర్మగుణమంతయు నాచేనిమొదలనే వినియోగింపఁదలఁచితిరా, మీ అధికారమువచ్చి నా తలగిల్లి వేసిననాటికి చూచుకొందము గాని యిప్పుడు 'నాచేనిఫలనష్టముకట్టియియ్యక నేనాగుఱ్ఱమును వదలను' అని ఒకపట్టుపట్టి తుదకు గ్రామమునందు గల పెద్దమనుష్యులు నలుగురుచేరి చెప్పఁగా గుఱ్ఱము కాళ్ళు నాలుగింటికి నాలుగు నాలుగులు పదియాఱురూకలు పుచ్చుకొని విడిచిపెట్టెను.

అంతట నాశిష్యులు గుఱ్ఱమునుదోలుకొనిజాము ప్రొద్దెక్కునప్పటికి గురువుగారొద్దకుఁబోయి జరగినవృత్తాంతమంతయు తెలియఁజేసిరి. గురువు అదంతయువిని మిక్కిలి విచారపడి మనకీగుఱ్ఱమెందుకు? దీనివలన నున్నధనమంతయు కర్చుకావ

ఉసినట్టున్నది. వృథాగా ధనము వెచ్చపడుటయేగాక దేహ ప్రయాసమెంత. పదులవలనఁగలిగెడి యవమానమెంత. ఇదంతయు నామహిమకు హానికరము, కనుక మనకీగుఱ్ఱము తోడి సంబంధ మక్కఱలేదు. అని కాలినడకతోనే పోను ప్రయత్నపడెను. అందులకు శిష్యు లెంతమాత్రము సమ్మతింపక మీరిట్లు నడవఁజూచుట సరికాదు. 'నడచియాత్ర చేయ మీరుశక్తులుకారు, గుఱ్ఱమేమిచేసినది పాపము-ఏదో గ్రహదోషముపోవఁగ మనలను కొంచెము హింసపెట్టుచున్నది. అందుకేమయిన పరిహారము వెదకుదము. గుఱ్ఱము నెక్కుఁడు. ప్రొద్దుపోయెను. అని యీవిధముగా ఊఱట మాటలు చెప్పుచుండగా ఆదారిని పోవుచున్న యొకవళ్ళువవాఁడు వీరి తిరంతయుఁ జూచి నేటి బత్తెమునకు దేవుఁడు దారిచూపించెనని తనలోతాను సంతోషపడుచు, అయ్యలారా! ఏలయిట్లు విచారపడుచున్నారు, మీరు గుఱ్ఱమును కొన్నవేళ మంచిదికాదు. దానిదోషము మిమ్మెంత తొందరకు ఆలయము చేసినది ఊరక లేనిపోని ఆలోచనలు చేయక ఖర్చుతో ఖర్చు అయిదురూకలు మనవికావు అని నాచేతపడవేయుఁడు. నేనాదోషమును పరిహారముచేసి మీకు నెమ్మది కలుగునట్లు చేసెదను, అనెను.

ఆమాటలువిని గురువుకొంచెము మెత్తపడినట్లుండెను. అదిచూచి శిష్యులందఱును ఒక్కమాటగా, స్వామీ! కర్మనకు వెనుకముందు చూడరాదు. ఒకటిపట్టున నూఱయిన ఖర్చుచేసి వచ్చినదోషమును తొలఁగించుకొనుటమంచిది. త

పుణ్యాత్ముఁడెవఁడో గానిమన సంకటములకుఁ గారణమును గుర్తెఱిఁగిచెప్పినాఁడు, మీరు మహాత్ములు గనుక దైవమే మీమనస్తాపము నివారించుటకై యీ రూపమున వచ్చి నాఁడు. అందులకుసందేహము లేదు. అని వాఁడు అడిగిన చొప్పున అయిదురూకలు వానికిచ్చి యాదోషమును పరి హరింపుమని చెప్పిరి.

అంతట ఆనడిమికొల్లగాఁడు చుట్టుప్రక్కలనున్న కొన్ని చెట్లలోని ఆకులుదూసికొనివచ్చి గుఱ్ఱముమీఁదను అది నిలచినచోటున చుట్టునుచల్లి మంత్రముచెప్పెడు వానివలె గొణగొణయని గొణఁగుచు, నడుమనడుమ 'హాహూ' అని కేకలువేయుచు కొంతసేపుగడపి కడపట గుఱ్ఱమునకు ప్రద క్షిణముగా ముమ్మాఱు ఎడమచేతితో నిమిరి చేతనున్న బెత్తముతో మెల్లగా మూఁడుదెబ్బలుకొట్టి దానిదేహ మంతయు పట్టిచూచుచువచ్చి దానికి యుండెడి ఒంటిచెవిని గట్టిగాఁబట్టి నేను చెప్పిన దోష మంతయు నీచెవిలో నిలిచి యున్నది. ఇది మంచిజాతిగుఱ్ఱము గనుక, దీనికి ముందో కప్పుడు గూడ ఈదోషము సోఁకి యొకచెవి కోయఁబడి నట్లున్నది. ఇప్పుడీరెండవచెవినికోయక యీదోషము తొలఁగదు. అనిచెప్పి, ఒడిలోనున్న చురకత్తితో దాని చెవికోసి దిగఁదుడిచి దూరముగాఁ దీసికొనిపోయి గుంట త్రవ్విపూడ్చి, ''అయ్యా ఈదోష మిఁక నెన్నిటికిని మీ గుఱ్ఱమునంటకుండ లోఁతుగాకుంటత్రవ్వి పూడ్చినాను. ఇఁక భయములేదు'' అని గురువు కప్పుకొనియున్న దుప్పటికొంగు

చించి గుఱ్ఱమునకు రక్షకట్టి 'మిమ్ముపట్టినపీడలన్నియుఁ దొలఁగి నవి పొం'డని చెప్పిపోయెను. ఇదంతయునగునంతలో మూఁడు జాములయినందున ఆగురుశిష్యులు 'నాయనా! నీపుణ్యాన కృతార్థుల మయితిమి, అనుచు అక్కడనుండి కదలియా సమీపగ్రామమునకుఁబోయి భోజన పానాదులు చేసికొని నాటిదినమంతయు అక్కడనేయుండి మఱునాడు ప్రొద్దున లేచి మెల్లగాఁబోయి మఠముఁ జేరిరి.

## ఆఱవది.

### బ్రాహ్మణు డాఃరూఢము చెప్పినకథ.

మఠముఁజేరిన పిమ్మట పరమానందగురువు గుఱ్ఱము కుహూపిగానున్నను వెలలేక వచ్చెఁగదా యనుకొన్నందుకు దానినంటినదోషముచేత పలుతొందరలు పడవలసివచ్చెనే యని దారిలోపడిన పాట్లను తలఁచుకొని విచారపడుచుం డియు, శిష్యులందఱువచ్చి తన్ను చుట్టుకొనికూర్చుండఁగా వారికి వైరాగ్యబోధచేయ నారభించెను. అది యెట్లనఁగా, శిష్యశిఖామణులారా! వినుఁడు. నామనసునకు రానురాను ఈ ప్రపంచధర్మములన్నియు నిత్యములు కావని తోఁచుచున్నది. దుఃఖము లేక సుఖమును, చేఁదులేక తీపును, కీడులేక మేలును లోకమునఁగానరావు. అందులకు దృష్టాంతము మనయనుభవమే. మనము లేనిగౌరవమునపే క్షించి గుఱ్ఱమునుకొనఁదలచితిమి, అదియు దైవికముగా పోచి కోలుగానే లభించెను. అట్లు గుఱ్ఱములభించిన సంతోషమునకు

యనుమిక్కిలిగానాటిదినము మనము పడినపాట్లు చూచితిరి గదా! ఒకబొట్టు తేనెనపేక్షించినవాఁడు అంతకు నాలుగంతల చేఁదు మ్రింగవలసియుండును. ఔరా! మంచిశాలిధాన్యము కూడ దంచిపొట్టుపోఁగొట్టక అన్నమునకు తగినదికాదు. అట్టిధాన్యములేవియు అట్లు శ్రమపడిబియ్యము చేయకయే ఎసటవేయ నను వుగా, నేర్పడవుగదా? అయినను, నేనీ గుఱ్ఱమునిమిత్తము ఒకనాఁడుపడినబాధతక్కినవేని వలనను గలుగదు. కాఁబట్టి, నాకు గుఱ్ఱమునెక్కి యాత్రచేయు యోగ్యతలేదు. విధినిర్ణయము ఇట్లుండఁగా మనమేమిచేయ వచ్చును! దైవికమును అనుభవింపక తప్పించుకొను మన తరమా? ఇఁక నీగుఱ్ఱమును దొంగలకుఁదోలి పొంగలిపెట్ట వలసినదే అనెను.

అందులకు శిష్యులందఱును చాల హర్షించి, ఔరా గురురాయా! తత్వపరిజ్ఞానమన నిట్లుండవలదా! ఇప్పుడుమీరు సెలవిచ్చినవిషయములను వినుటచేత మామనసులలోని కల తలుతీరెను. ఇతరులమనసున కింత తెలివిగలుగఁజేయఁ జాలిన మీకువిచారము అనునదియెక్కడిది? అయినను ప్రపంచధర్మమును అనుసరించితిరి. మీరిప్పుడు ఆనతిచ్చిన చొప్పున దైవికముగావచ్చిన సుఖదుఃఖములను అనుభవించి తీఱవలసినదే గనుక, మీరుకోన్నదియు మేము ప్రయాసపడి తెమ్మన్నదియుఁ గాదు యీగుఱ్ఱము మనకు దైవికముగా లభించినది. దీని నిమిత్తమైవ లాభనష్టములును సుఖదుఃఖ ములును మనము అనుభవింపవలసినదే, కనుక మనముకేవల

విరక్తిమార్గమునవలంబించి ఈగుఱ్ఱమును దేశముమీఁద తఱిమినయెడలదీనిని అనాయాసముగా మనకులభింపఁజేసిన ఈశ్వరుని నియమమును తిరస్కరించినవారమగుదుము. అదియెంత పాతకమో మీరేవిచారింపుఁడు. అంతేకాదు మనము పలుపాట్లుపడుటకు నిమిత్తమయినదోషము ఆ పుణ్యాత్మునిదయచేత నిన్నటితో నివారణమయిపోయెను, ఇఁకను దీనివలన నేయిబ్బందియుకలుగఁబోదు. అట్లుండగా లేనిపోని శంకలు తెచ్చుకొనినిర్నిమిత్తముగా యుక్తోచితగౌరమునకు ఆకరమయిన యీగుఱ్ఱమును దొంగలకుఁ దోలనేల?, అనిశిష్యులు బహువిధములహితోపదేశముచేయఁగా గురువు మనసులోని నెంజలిమాని అన్నలారా! మీరు చెప్పినది సరికాదనను. అయినను పడ్డపాట్లుతలఁచుకొన్న పక్షమున దేహము జలదరించుచున్నది. కాఁబట్టి ఆగుఱ్ఱమును తరిమివేయుట మీకిష్టములేనియెడ కొట్టములోకట్టివేసిపెట్టి చేతిమేఁత మేపుచువత్తురుగాని మొన్నటివలె దొంగమేతమేయఁదోలి కొంపముంచకుఁడు. అనఁగా, మూఢజనేంద్రుఁడు స్వామీ! అవిషయమునందు మీకువిచారమక్కఱలేదు. క్షణకాలములో మనమఠముప్రక్క నొకలాయమును కట్టి గుఱ్ఱమును కట్టివేసెదను చూడుఁడు! అనిచెప్పి, అప్పుడే ఒకమడ్డుకత్తి యెత్తుకొనిబాటవెంబడినున్న పెద్దయూడ వృక్షమెక్కి, ఆమ్రానియందలికొమ్మలనెల్ల చక్కఁగాఁజూచియొక వంకరలేని నిడుపాటికొమ్మను నఱుకువాఁడై దానికొనను గూర్చుండి మొదలు నఱుక నారంభించెను.

అప్పుడొక బ్రాహ్మణుఁ డాబాటనుబోవుచు వీనిని జూచి, అబ్బీ! అట్లుకూర్చుండి కొమ్మఁగొట్టకుము. కొమ్మ తెగఁగానే కొమ్మతోడ నీవునునేలఁగూలుదువు అనెను. మూఢజనేంద్రుఁడు, శుభముగా గుఱ్ఱపులాయమునకు కొమ్మ నఱకవచ్చిన నన్నీయపశకునపుమాట లాడుమన్నవారెవరు? అని కోపముచేఁ గన్నులెఱ్ఱవాఱగా, పండ్లుకొఱుకుచునఱకు చున్న మడ్డుకత్తిని ఆబ్రాహ్మణునిమీఁదవిసరివేసెను. అతఁ డాదెబ్బతప్పించుకొని మూఢునకుబుద్ధిచెప్పఁబోయినందులకుఁ దగిన ఫలము కలిగె ననుకొనుచుఁదొలఁగిపోయెను.

ఆమూఢుఁడు చెట్టుదిగివచ్చి మడ్డుకత్తి యెత్తుకొని చెట్టెక్కి మునుపటివలెనేకొమ్మనునఱుకఁగా కొమ్మతోడవాఁ డును నేలఁగూలెను. అట్లుపడిలేచి యామూఢుఁడు బ్రాహ్మ ణుఁడుచెప్పినమాటనుతలఁచుకొని, అమ్మమ్మా! ఆబ్రాహ్మ ణుఁడు మంచిజోస్యుఁడు. మిక్కిలి తెలిసినవాఁడు అని తోఁచుచున్నది. మాగురువులయాయుః ప్రమాణము అతని నడిగినయెడ విశదముగాఁదెలిసికొనవచ్చునని తటాలున లేచి దేహమునందలి మన్నుతుడుచుకొనుచు నొక్కపరుగున ఆబ్రాహ్మణునిచేరఁబోయి, 'ఓబ్రాహ్మణుఁడా! ఒకమాట వినిపొమ్ము నిలువుము నిలువుము, అని కేకలువేయసాగెను. ఈకేకలువిని ఆబ్రాహ్మణుఁడు తెలివిమాలిన యీరెండు కాళ్ళమృగము ఏమిచేయునో తఱుముకొనివచ్చుచున్నదే యని కొంతదూరముపోయి పిమ్మట పాలేక అయినది కాని మ్మనినిలిచెను. అంతట నీమూఢజనేంద్రుఁడుదగ్గఱబోయి

ఆయనపాదములు తననొసలుసోఁకునట్లు సాగిలఁబడి దండము పెట్టి, 'అయ్యా! మీరు మిక్కిలి పెద్దలు' మీఘనత తెలియక నేనట్లు కోపించుకొన్నాను. ఆనేరమునకు నన్నుమన్నించి నాకు నింకొకజ్యోస్యము చెప్పవలెను. నేనెవఁడో యని అనాదరము చేయవలదు. మహాజ్ఞానపూర్ణులగు పరమానందగురువుల ముఖ్యశిష్యుఁడను. నాపేరు మూఢజనేంద్రుఁడు. నేను మిక్కిలి గురుభక్తిగలిగి మెలఁగువాఁడను. వృద్ధులయిన మా గురువులు ఎప్పుడు దేహమువిడుతురో యని విచారపడుచుందును. కనుక ఆవిచారముతొలఁగునట్లు వారిమరణకాలము పలానిదియనియు, అందులకు ముందు కానఁబడు గుఱుతులు పలానివనియు, నాకుఁదెలియఁజెప్పవలెను, అని రెండు కాళ్లు గట్టిగాపట్టుకొని వేఁడుకొనసాగెను.

ఆబ్రాహ్మణుఁడు నిజమయినజ్యోస్యుఁడు కాఁడు. కనుక వాని వదలించుకొనునుపాయమేమియుఁదోఁచక కొంతసేపు ఊరకయుండి పిమ్మట, ఎవరో చెప్పఁగా వినియున్న యొక శ్లోకపాదము జ్ఞప్తికిరాఁగా ఇది వీనికిఁజెప్పవలసినమాట అని నిశ్చయించుకొని "ఆసనశీతం జీవనాశమ్, అనెను. అదివిని వాఁడు, అయ్యా యిట్లుసెలవిచ్చిన నాకు తెలియదు. అందలి తాత్పర్యము విశదముగాఁజెప్పుడుఅనెను. అందులకుబ్రాహ్మణుఁడు ముడ్డి చల్లబడినప్పుడు ప్రాణముపోవును అని యీవచనమునకు అర్థము. నీగురువునకు ఎప్పుడు ఆసనముచల్లఁబడునో అప్పుడు చావుసమీపించెనని తెలిసికో, అనిచెప్పి, మెల్లగావదలించికొని ఆవలసాగిపోయెను. మూఢజనేంద్రుఁ

డును చాలసంతోషించి. నాయదృష్టము మంచిది కాఁబట్టి యింతటి పెద్దలసేవలభించెను. గురువులసేవ కలవరములేక చేయుమార్గమును తెలిసెను. అనుకొనుచు మత్రిమ్రానిి యొద్దకువచ్చి తాను నఱకినకొమ్మనీడ్చుకొని మఠమునకుఁ బోయి జరిగినవర్తమానమంతయు గురువునకును తక్కిన శిష్యులకును ఎఱిగించెను. అంతట గురువు ఈజోస్యము చెప్పినబ్రాహ్మణుఁడు మిక్కిలి తెలిసినవాఁడుగాని సామాన్యుఁడుకాఁడు. తొలుత అతఁడు చెప్పినమాట వెంటనే నీకు అనుభవమునకు వచ్చెను. కనుక నాకుజెప్పినదియుతప్పదు. 'ఆసనశీతంజీవనాశమ్, అనునది వేదవాక్యముగాని సాధారణ వచనమని తలపరాదు. ఇది మొదలు ఆసనము శీతము కాకుండునట్టి జాగ్రత్తతో ప్రవర్తింపవలెను. ఇఁకమీఁద శంకానివృత్తి చేసికొన్నపుడు ఏదయిన తగినయుపాయము చేత ఆ దుర్గంధమును పోగొట్టుకోవలసినదేగాని ప్రక్షాళ సముగూడ చేసికొనుట యుక్తముకాదు. మన మిట్లు జాగ్రత్తతోగుండవలసినది. అందుమీఁద దేవునిచిత్తము, అని మిక్కిలి విచారముతో చెప్పెను.

శిష్యులు మూఁడజనేంద్రుఁడు కొట్టుకొనివచ్చిన కొమ్మను కూచములు మొదలగువానికి నుపయోగించి యింక కావలసిన విడవలి మొదలగువానిని సేకరించి లాయముకట్టి గుఱ్ఱమును అందుకట్టివేసి మేపుచుండిరి.

# ఏడవది.

## గురువు గుఱ్ఱముమీఁదనుండి పడిన కథ:

ఆగురుశిష్యులు తామనుకొన్నచొప్పున కొంత కాలము మిక్కిలి యెచ్చరికతో మెలఁగుచు మఠమునందే యుండి గ్రాసవాసములకు జరగుపాటులేక దేశాటనముచేసి శిష్యులవలన ద్రవ్యార్జనముచేయఁగోరి మఠమునుండి బయలు దేఱునప్పుడు శిష్యులు అయిదుగురును ఆగురువునను మతి లేక తామేపనియుఁ జేయకుండునట్లు నిశ్చయించుకొని వెడలి, తమ నియమము తప్పక బహుదేశములుతిరిగి మరల మఠము దారిఁబట్టివచ్చునప్పుడు ఒకచోట మిక్కిలి వాలినకొమ్మలు గల మ్రానిక్రిందుగా రావలసివచ్చెను. అప్పుడు గుఱ్ఱము మీఁదఁగూర్చుండి యూఁగులాడుచు వచ్చుచున్న గురువు యొక్క తలపాగా ఆమ్రానివాలుగొమ్మల రాపిడిచేత వీడి క్రిందపడిపోయెను. గురువు వెనుకవచ్చుచుండు శిష్యులుదాని నెత్తుకొని వత్తురనియెంచి యూరక నడచి కొంతదూరము పోయినపిమ్మట శిష్యులనుజూచి నాతలపాగా ఎక్కడ అని అడిగెను. అందులకుశిష్యులు 'ఎక్కడపడెనో అక్కడనే యున్నది' అనిచెప్పిరి. గురువు అవురాబాగుగాయున్నది. వెనుకవచ్చువారు ఏదయిన జాఱిపడినయెడ చూచితీసికొని రావలదాఅని నిష్ఠురములాడి, ఇఁకమీఁద ఏమిపడినను ఎత్తుకొనిరండు అని చెప్పెను. అంతట అచేతనతిలకుఁడు అను వాఁడు వెనుకకుఁబోయి దారిలోపడిపోయినగురువుతలపాగా

తీసికొనివచ్చుచు ఎదుట గుఱ్ఱము వేసిపోయినలద్దినిఁజూచి యిదియుగురువులవారి సొమ్మేకదాయనియెత్తి పాగాకొంగున మూటకట్టితీసికొనివచ్చి గురువుచేతి కిచ్చెను. గురువు ఆలద్ది మూటనుచూచి 'ఛీఛీ' యిదియేమని తెచ్చితివి అని అసహ్యాపడి కోపించుకొనెను. అందుకాశిష్యుఁడుఁస్వామీ! ఆజ్ఞాప్రకారముచేసినపనికిఁగూడమీరు కోపముచేయవచ్చునా, ఇది యేమి రానురాను మీకొలువు పొట్టిపోతురాజు కొలువగుచున్నది. అనఁగా గురువు చిఱునవ్వు నవ్వుచు నేనుచెప్పిన మాటకు అట్టియర్థమును దీనితివా? సెబాసు! ఎత్తఁదగినది యిది, ఎత్తఁదగనిది యిదియనువిచారము ఉండనక్కఱ లేదా? అనెను' శిష్యులు అందఱును ఒక్కమాటగా అయ్యా అంతటివివేకజ్ఞానముమాకు లేదు. మీరునోటిమాటగాఁజెప్పినను మాకుజ్ఞప్తియుండదు. మీరు వెనుకపడినవస్తువులలో ఎత్తుకరాఁదగినవియివియని ఎత్తుకరాఁదగనివియివి యనివ్రాసి యిచ్చిన ఆపట్టీచేతఁబట్టుకొని క్రమముతప్పక వెనుకపడ్డవస్తువుల నెల్ల నెత్తుకొనివచ్చెదము అనిచెప్పి గురువుచేతపట్టీ యొకటివ్రాయించికొని నడవసాగిరి. అంతట తోలునాడు, వానకురిసియున్నందునను త్రోవబంకమట్టినేలగా నున్నందునను తడఁబడుచు నడిచివచ్చుచున్న యా కుంటి గుఱ్ఱము కాలుజాఱిపడెను. తోడనేదానిమీఁదఁగూర్చుండిన గురువు ఆ త్రోవవెంబడి గోతిలో వెల్లకిలబడి చచ్చితినిచచ్చితినియని యఱవసాగెను. అప్పుడు శిష్యులు అయ్యో! గురువు పడెనేయని దుఃఖపడుచు అతఁడుపడిన గోతియొద్దకుఁపోయి

పాగాధోవతి, ఉత్తరీయము, చొక్కా, తుండుగుడ్డ పావకోళ్ళు తీసికొని ఆయననుదిసమొలతో ఆపల్లమునందునిలిపిబయలు దేఱిరి. అప్పుడు గురువు నన్నుఁబల్లమునందుపడవేసి నా ధోవతిమొదలగువానిని ఎత్తుకొనిపోయెదరే నాగతియేమి అని అడుగఁగా, గురురాయా 'మీరువ్రాసియిచ్చినపట్టికను చూచుకొనుఁడు'అని యుత్తరముచెప్పిరి. అంతట గురువు వారిని బహువిధముల వేఁడికొని ఎంతవేడుకొన్నను పట్టికలో నుదహరింపన్నిపని మేము చేయసేరమని శిష్యులుపట్టుగా బలుకఁగా, నేను పడినక ఎత్తుఁడని అప్పుడు వ్రాసి యిచ్చి వారిచేత ఎత్తఁబడి నాట్టిసాయంకాలమునకుమెల్లగా వచ్చి మఠముచేరెను.

# ఎ ని మి ద వ ది.

## గురువును భూస్థానము చేసినకథ.

గురువు గోతిలో పడినప్పుడు మిక్కిలిశ్రమపడినందున ''ఆసనశీతం జీవనాశమ్'' అన్నమాటమఱచినిర్విచారముగా మఠమువచ్చి చేరియు, పిమ్మట జ్ఞప్తికివచ్చినందునీటిపల్లములో పడితిమే ఆసనము శీతమయ్యెనే అని విచారించుచుండి, ఆరాత్రి దేహమందు నొప్పులు కలుగఁగా నిద్ర పట్టక యిటునటు పొరలుచు, వార్ధకదశయందు బురద గోతిలో పడినందున దేహమలసి నొప్పులుకలిగెనని యెంచక, ఆసనము శీతమయ్యెను, ఇంక జీవమునశింపకమానదు అని, మాటికిమాటికి అదిరిపడుచు, తబ్బిబ్బు మాటలాడుచు,

నిట్టూర్పులువిడుచుచు, ఆ రాత్రియంతయు జాగారముచేసి, తెల్లవాఱి తమకు సేవచేయవచ్చినశిష్యులనుజూచి, జ్యోస్యుని మాటఫలించెను. ఇదిగోచూడుఁడు నాదురవస్థ. ఇఁక నేను బ్రదుకఁబోను, మీరునాయాసవదలుకొనుఁడు అనెను. శిష్యులును అతనియారాటపాటును, ముఖము అగ్గిదాఁకియుండుటను, నోటతడిలేకుండుటను, తబ్బిబ్బుమాటలాడుటనుజూచి, చాల దుఃఖించి, ఒకరినొకరునూఱడించుకొనుచు, ఈకను గుంటలు, ఈపీనుఁగుకళపడినమొగము, ఈదిగ్భ్రమమును, ప్రాణముపోవునట్టివారికిఁగాక ఇతరులకుఁగలుగునా! ఇంక అయ్యగారు పరలోకమునకుఁబోవువారే, అనినిశ్చయించి, స్వామీ గురురాయా! ఇఁకమాకేమిబుద్ధి అని ఆయనపాదములమీఁదఁబడిరి. అప్పుడుగురువు బిడ్డలారా! మీరుదుఃఖింపకుఁడు. మీరు శిష్యులయినందుకు నన్నొకపరిశుద్ధప్రదేశమునందు స్థాపించి మీఁదఁగోటకట్టింపుఁడు. ఇఁక నాకుగతిమన్నే అనఁగా, శిష్యులుఅదేమిఅట్లుసెలవిచ్చెదరుతగువాటివైద్యునిఁ బిలుచుకొనివచ్చి తగినమందిప్పించెదము. మందుపుచ్చుకొనుఁడు. అందుమీఁద దైవయత్నము చొప్పునఅగునదికానిండు అనిరి. అందులకు గురువు, ఆసనశీతం జీవనాశమ్, అనుమాట మఱచితిరా, ఇఁకనాకుమందులేల మాకులేల? నిన్నపడిన గోతిలో అడుసునీళ్ళు విశేషముగానుండెను. నేను అందుఁబడితడిసినందున నాయాసనము శీతమయ్యెను. అదియుఁగాక మీరుజోస్యుఁడుచెప్పినమాటమఱచి పిమ్మటనాదేహమునందలి యడుసును తొమికడుగుటకై నన్ను స్నానముచేయిం

చితిరి. అదికారణముగా నాకుమరణవేదన కలిగి రాత్రియంత యు నిద్రలేక యారాటపడితిని. ఇంక బ్రతుకాసయెక్కడిది ఊరక నన్ను భూస్థాపనముచేయుటకు కావలసినవస్తువులను సిద్ధముచేసికోనుఁడు అనిచెప్పి దుఃఖించెను.

అంతట శిష్యులు గురువునందుఁగలదుర్లక్షణము లెల్లనుజూచి యిఁక యీయనకు చావుతప్పదు అని నిశ్చ యించియు అందువలనివిచారమును బయలుపఱుపక గురువు నకు అప్పటికిఁ దగ్గిన యూఱటమాటలుచెప్పి, ఆయనకుగల మనఃక్లేశమును పోఁగొట్టఁబ్రయత్నించియు, తమప్రయత్నము నెఱవేఱకపోయినందున మున్నపు వారిమఠమునందు జ్యోతి శ్శాస్త్రపండితుఁడై యున్న యచేతనమూర్తికుమారుఁడయిన అసంగతమూర్తి అనువానిని పిలిపించి ఓయి దైవజ్ఞశిఖా మణీ! మనగురువులవారు గ్రహచారవశముచేత చిత్తస్వాస్థ్య ముచెడి సంకటపడుచున్నారు. నీవు వారిగ్రహచారమును చక్కఁగాఁ పరిశీలించి చెప్పి వారిమనసులోనికలవరమును పోఁగొట్టుము, అనిచెప్పిరి. ఆజ్యోస్యుఁడు జరిగినవృత్తాంత మంతయుతుదముట్టయడిగి తెలిసికొని, నాగురురాయా! మీ కిప్పుడుకలిగియుండెడి బాధయేమి? జ్వరమా, తలనొప్పియా? లేక ఏమేనిమనసునకొఱంతగలిగి యిట్లు సంకటపడెదరా ఆనతియిండు. నేను మీప్రియశిష్యుఁడనేగాని అన్యుఁడను కానుగదా! నాతోశంకవిడిచి సెలవియ్యవచ్చునుగదా! అని పెదవులుఅదరగా అడిగెను. గురువు అందులకుఁదగినయుత్త రముచెప్పుటకు మాఱుగా, ఆసనశీతంజీవనాశమ్-అని యూర

కుండెను. అంతట ఆయసంగతమూర్తి, ఓహో! ఇదియా సమాచారము. మీరు ఆజ్యోస్యము చెప్పిన బ్రాహ్మణునిఁ బట్టుకరండు. నేను వానికి ఆసనోష్ణమును జీవనాశమును అగునట్లు చేసెదను. అసనమేమి? శీతమేమి-జీవమేమి? నాశమేమి- ఇదిపట్టిమోసపుమాట. వానినిప్పుడు నాయెదుటికి పిలుచుకొనిరండు, రోకఁటిపూజ చేసిపంపెదను. అంతటితో ఆదోషముతొలఁగిమనఅయ్యగారి మనోవ్యధతీరును. అనఁగానే, గురువు కొంచెముకలపరముతీఱి రోఁకటిపూజఅనఁగానేమి? ఆపూజయొక్క మర్యాదయెట్టిది? ఇట్టిపూజయొకటిగలదని నేనెన్నఁడునువిన్నదిలేదే! దానిసంగతికొంచెము చెప్పుము అని యడుగఁగా అసంగతమూర్తిచెప్పఁ దొడఁగెను.

ఒకయూరిలో నొక శివభక్తుఁడుగలఁడు. వానికిజంగాలకు అన్నముపెట్టుటయందు మిక్కిలిప్రీతి. కనుకవాఁడు ప్రతి దినము తెల్లవాఱిలేచి కాశీరామేశ్వరపుబాట వెండికూర్చుండి వచ్చుచుఁబోవుచునుండు జంగాలనెల్లను ప్రార్థించి యింటికిఁ బిలిచుకొని వచ్చుచుండును. వానిపెండ్లామిట్లుఎడతెగక తిండికివచ్చుజంగాలకువండిపెట్టిపెట్టి పెనిమిటిమాటమీఱలేక సంకటపడుచుండి, ఒకనాడు ఒకయుపాయముపన్నెను. ఏమనఁగా, తనమగఁడు ఎప్పటివాడుక చొప్పున బాటవెంబడి గూర్చుండియుండఁగా, ఒకజంగమువానికిఁగనఁబడెను. వాడు ఆజంగమును జూచినమాత్రముచేతనే తటాలునలేచిమీఁది యుత్తరీయమును నడుమునజుట్టుకొని సాగిలఁబడిదండముపెట్టి, స్వామీ, జంగముదేవరా! 'నేడు మాయింటికివచ్చి భిక్షతీసి

కొనదయసేయుఁడు, అని ప్రార్థించెను. ఆజంగమందులకు ఒప్పుకొని మీయిల్లుఎక్కడపోదము రమ్మనగా, వాఁడు తన యిల్లుగుఱుతుచెప్పి మీరుముందుపొండు నేనుకొంచెముసేపు తాళివచ్చెదను. నేను ఇల్లుచేరునంతలో వంటచేసిపెట్టుమని మాయింటిదానితోఁ జెప్పుఁడు. అనిచెప్పిపంపెను అందులకు ఆజంగము సంతోషించివాఁడుచెప్పినగుఱుతువలన వాని యిల్లుఫలానిదని తెలిసికొనిపోయి వానిపెండ్లాముపలానిదని తెలిసికొనిపోయి వానిపెండ్లాముతో 'అమ్మామీయింటి యాయన బాటవెంబడినుండినన్నుఁ బంపినాఁడు. ఆయన కొంచెముసేపుతాళివచ్చెదను, వచ్చునంతలో వంటచేసిపెట్టు, మని నీతోఁజెప్పుమన్నాఁడు.' అని చెప్పెను. అదివిని యా యిల్లాలు ఇతఁడెన్నఁడు మాయింటికివచ్చినవాఁడుకాఁడు. ఈ జంగముల రాయిడి తప్పించుకొనుటకిదిసరియైనసమయము అనియోచించి అయ్యాజంగముదేవరా! రండు అని పంచతిన్నె మీఁద చాఁపపఱచి కూర్చుండఁబెట్టి, ఇంటిముందటిచావడి చక్కఁగాచిమ్మి అలికిముగ్గుపెట్టి, స్నానముచేసిమడుఁగుచీర కట్టుకొని పరిశుద్ధముగాఒకరోఁకలితెచ్చి చావడిలోనుంచి దానికి పసుపువిబూదిపూసి కుంకుమబొట్టుపెట్టి ముమ్మారు ప్రదక్షిణముచేసిమ్రొక్కి, మంత్రములుచెప్పుదానివలె 'నోటగొణగొణయని గొణఁగుచు పువ్వులతో పూజఁజేసి, పిమ్మటరోఁకలి తుడిచి యెప్పటితావునఁబెట్టెను. ఆవచ్చియున్న జంగము నదంతయుచూచి, అమ్మాయిదియేమిపూజ ఇట్టిపూజచేయఁగా నేనెక్కడనుజూచినదిలేదు, అనఁగా, ఇంటియావె, దేవరా!

ఇదిమాయిలువేలుపు. ఇట్లు దీనిప్రతిదినముఅతిథియింటికిరాఁగానే నేను పూజించుచుందును. అని, అంతట ఈవిశేషపూజవలనిప్రయోజనముమాయింటియాయనరాఁగానేమీకుఁజక్కగాఁ దెలియవచ్చును. అనితనలోతానుమెల్లగాఁజెప్పికొనుచువంటసాలప్రవేశించెను. ఆమాటలు చెవినిపడఁగానే జంగముదేవర: ఔరా! ఎంతప్రమాదమువచ్చెను. అనిగ్రుక్కుమిక్కుమనక మెల్లగాలేచిపాఱిపోయెను మఱికొంతసేపటికి ఇంటివాఁడువచ్చినేనుబంపినజంగముదేవర యెటుపోయెననిభార్యనుఅడుగఁగా,ఆపె, సెబాసు! నేడుమంచిజంగమునుబంపితిరి, అతఁడు ఇంటికివచ్చి రాకముందే పిల్లా! రోఁకలి తెమ్మని యడిగెను. అతని తలఁపు ఇట్టిది యని తెలియనందున నేను రోఁకలి యియ్యక, మాయజమానుల యుత్తరువులేక నే నెవరికినిఏవస్తువు నిచ్చునట్టివాడుక లేదు వారురాఁగానేవారిని అడిగియిచ్చెదనుఅనిచెప్పి, పంచతిన్నెమీఁద చాపపఱచి కూర్చుండుఁడు అని చెప్పితిని అందులకు అతఁడుకోపించుకొని మాతిత్రిప్పుచువెడలిపోయెను. నేనుఏమిచేయవచ్చును? అనిచెప్పెను అంతట ఆగృహస్థుఁడు, ఓసివెఱ్ఱిదానా! అర్థముప్రాణము ఆచార్యాధీనము అన్నట్టు మనయింటగలవస్తువులన్నియు జంగముదేవరలవేకదా వారికి ఇది. ఇయ్యరాదు ఇది యియ్యవచ్చును అను నియమ మెక్కడిది, అనిరోఁకలియెత్తిచేతఁబట్టుకొని ఆజంగమునువెదకువాఁడై రాజమార్గమునవెడలెను. ఆబాటవెంబడి ఒకయింటివాకిట కూర్చున్నజంగము వీనినిజూచి, అయ్యో! చెడితినే ఈక్రూరుఁడు అతిథిపూజనెపముపెట్టి యెందఱినోజం

గాలను రోఁకటికి బలియిచ్చుటగాక నన్నుఁగూడ తలపగులఁ గొట్టి రోఁకటిపూజపూర్తి చేయవచ్చుచున్నాడే, అని మొఱ పెట్టుచుపరుగెత్తసాగెను. గృహస్థుఁడు ముసలివాఁడైనందున వెంబడించి పరుగెత్తిపట్టజాలక, ఓజంగముదేవరా! జంగము దేవరా! ఏలపాఱిపోయెదవు? ఈరోఁకలిపుచ్చుకొని నన్ను కృతార్థునిజేయుము అని గట్టిగాఅఱచిచెప్పియు అతడు వెనుక తిరిగిచూడక పాఱిపోవుటనుచూచిఅయ్యో! నేనునాయింటిదాని యజ్ఞానముచేత శివభక్తులకు దూరస్థుఁడనయితినేయని దుఃఖప డుచుఁదనయింటికిఁబోయెను. నాటనుండి 'రోఁకటిపూజ' యను మాట లోకమునందుఁబ్రసిద్ధమయ్యెను. కనుక ఆజ్యోసము చెప్పినబ్రాహ్మణునికి రోఁకటిపూజజరగించినపక్షమున అతనికే గాక మీకుగూడ అసనోష్ణముకలుగును. మీరుచెడక మను దురు, అనగా, పరమానందగురువు పకపకనవ్వి నీకు అసంగ తుఁడుఅను పేరుసార్థకముగాని వ్యర్థముకాదుఅనెను. అంతట అసంగతుఁడు గురువునుజూచి స్వామీ! నేనుచెప్పినమాట పరి హాసముగానెంచవలదు. ఆబ్రాహ్మణుఁడు చెప్పినమాటవల్లనే కదా మీకింతకలవరముపుట్టెను. ఆమాటయొక్క అర్థమును చక్కగావిచారించునెడ ఏకారణమునులేకయే ఆసనము శీత మయినజీవము నశింపవలెగాని నీళ్లలోనుబురదలోనుపడినప్పు డును స్నానముచేసినప్పుడును నీళ్లుసోఁకిశీతము కలిగినయెడ జీవమునశింపఁగూడదు. ఆసనము నీళ్లుపోసినప్పుడుగూడ ఉష్ణ ముగానుండుడ స్వాభావికమగునేనిఅదిసరియనవచ్చును. అట్లుం డదు కాఁబట్టి ఈకలవరమునుమానుఁడు. ఇఁకమీఁదఎప్పు

డుగాని తడితగులకయే ఆసనముచల్లఁబడినపక్షమున జీవనాశ
నము అగుననినిశ్చయింపుఁడు. అనిఅసంగతుఁడు ధైర్యముచె
ప్పఁగాగురువు కొంచెము ధైర్యము తెచ్చికొని దేహమునందు
లేవను కూర్చుండను తగుపాటి సత్తువ కలుగఁగాపండుకొన్న
తావునుండి లేచిపోయి భోజనముచేయను, వచ్చినవారితో
నెమ్మదిగా మాటలాడను, శక్తికలవాఁడాయెను.

పిమ్మట ఒకనాటి అర్ధరాత్రమునందు గొప్పవానయొ
కటికురిసి పరమానందగురువు పండుకొనియున్న తావునందు
ఊరిసినందున ఆయనయాసనమునకు సరిగా కొన్ని నీటిబొట్లు
పడి తడిసి చల్లదనముకలిగెను. ఆయన నిద్రలోఉరుపు నీళ్లు
పడినసంగతి తెలియక ఉలికిపడిలేచి ఆసనమునుతాఁకిచూచు
కొని, అప్పుడు నిమిత్తములేకయే ఆసనము శీతమయ్యెను
కాఁబట్టి యిఁక జీవనాశమగుటతప్పదు, అని చింతాక్రాంతు
డయి ఆసంగతి తనశిష్యులకుఁ దెలియఁజేసెను. శిష్యులును
అందులకు కారణము ఇదియని యూహింపలేక జీవనాశకాల
మగుటచేతనే ఆసనముశీతమయ్యెనని నిశ్చయించి, అయ్యో
గురురాయా! పోయెదవా? అని గొంతెత్తి పెద్ద పెట్టున ఏడువ
సాగిరి. ఆయేడ్పునువిని యిరుగుపొరుగులనుండు జనులనేకులు
వారిని చూడవచ్చిరిగాని వారును వీరితోపాటువారే యయి
నందున కారణమును ఊహింపనేరకదుఃఖించువారైరి. అట్లు
ఎల్లవారునుచింతాక్రాంతులగుటఁబట్టి గురువునకు కాలమునకు
జలాహారములు అందక దేహమునందు ఆరాటము హెచ్చఁ

గా ఎవరు ఏమియడిగినను, 'ఆసనశీతం జీవనాశ' మనుటతప్ప వేఱుమాటలేక యుండెను.

అంతట శిష్యులందఱును అయ్యో! దైవముచిరకాలము మనలను నంతరించిన గురువునెడఁబాపెనే. ఆ ప్రాణము కొంచెము పోయినప్పుడు మనము ఏమిచేసినను వారు తెలిసికొని సంతోషింపఁబోరుగదా! వారికిబాగుత్తిగా తెలివితప్పక ముందే మనము చేయగలకార్యములు చేసే తృప్తిపొందింపక పోయిన వీరిఋణము మనకెట్లుతీఱునుఅని యేడ్చుచు, శవరథమును అలంకరించి తెచ్చి గురునియెదుటఁబెట్టి. స్వామీ! దీనిమీఁదనా మీాఁక యూరేగఁబోయెదరుఅనుచు, నొకపెద్ద తొట్టి తీసికొనివచ్చి దానినిండా నీళ్లు చేఁదిపోసి అందులో గురువునుదింపి తలాఒకతట్టు అణఁచిపట్టి దేహమును తోమి కడుగసాగిరి. గురువువృద్ధుఁడుగనుకను నలుగురు నాలుగువైపులను బట్టి నీళ్ళలోముంచి అదిమిపట్టితోముటచేతను ఊపిరితిప్పుకోఁజాలక ప్రాణములనుత్యజించెను. కనుక తెలివిమాలినవారు తమకుఁదామే లేనియాపదలను గలుగఁజేసికొని హింసపడి చచ్చెదరు.

అట్లునిర్బంధముచేత ప్రాణములువిడిచినయాగురువును శిష్యులు చక్కగాస్నానముచేయించి వస్త్రమాల్యాదులచేత అలంకరించిశవరథముమీాఁదఁబెట్టి "ఆసనశీతంజీవనాశమ్" అని చెప్పుచు మఠము వెంబడిపూలతోఁటలోనికిఁబోయిఒకతావున పల్లముత్రవ్వి పూడ్చివేసిరి.

---

శుభం భూయాత్.